


Visit : www.chandamama.com/parle






Coconut Development Board
(Ministry of Agriculture, Government of India)
cdbkochi@dataone.in, www.coconutboard.gov.in

# ఈ సంచికలో...

చందమామ సంపుటి: 62 అక్టోబర్ 2009 సంచిక: 10



















# ఆలోచించవలసిన కొన్ని విషయాలు

ఈ నెలలో పలు కార్యకలాపాలను చూడనున్నాం. ఒకవైపు ఆరు నెలల పరీక్షలు దగ్గర పడుతున్నాయి. పద్ధతి ప్రకారం శ్రద్ధగా చదవడానికి ఆయత్తం కావాలి. మరోవైపు దీపావళి సంబరాలు ముంగిట్లోకి వచ్చేశాయి. పిండివంటలు, కొత్త బట్టలు, బాణాసంచాలు బంధుమిత్రులను కలుసుకోవడం అంటూ అందరిలో ఆనందోత్సాహాలు విరబూసే సమయం! లోకకంటకుడైన నరకాసురుణ్ణి శ్రీ కృష్ణుడు వధించిన శుభ సందర్భాన్ని పురస్కరించుకుని నరక చతుర్దశి-దీపావళి జరుపుకుంటున్నాం. బాణాసంచా పేల్చేప్పుడు పిల్లలూ పెద్దలూ తగు జాగ్రత్తలు పాటించడం చాలా ముఖ్యం.

భరతమాత ముద్దుబిడ్డలిద్దరి జన్మదినోత్సవాలు ఈ నెలలోనే వస్తున్నాయి. జాతిపిత మహాత్మా గాంధీ, మాజీ ప్రధాని లాల్‌బహదూర్ శాస్త్రి జన్మదినోత్సవాలు అక్టోబర్ 2న జరుపుకుంటున్నాం. అణచివేతను మనోబలంతో ఎదుర్కొనే అహింసా మార్గాన్ని ప్రపంచానికి చూపిన మహనీయుడు మహాత్మాగాంధీ. ప్రస్తుతం యావత్ ప్రపంచం తమ చర్యలను అహింస దిశగానే సాగిస్తున్నాయి. మనదేశానికి లాల్‌బహదూర్ శాస్త్రి అందించిన జై జవాన్-జై కిసాన్ నినాదం అమూల్యమైనది. మనదేశానికి సంబంధించినంత వరకు సమాజ పటిష్ఠతకు రైతు-సైనికుడు మూలస్తంభాల్లాంటి వారు.

ఇక, ఈ యేడాది దేశంలో పలు ప్రాంతాలలో వర్షపాతం తక్కువగానే ఉంటున్నది. అందువల్ల జలవనరుల పరిరక్షణ పట్ల శ్రద్ధ కనబరచవలసిన అవసరం చాలా ఉన్నది. తక్కువ నీటితో ఎక్కువ పంటలు పండించే విధానాలను అనుసరించాలి. వర్షపాతం చాలా తక్కువే అయినప్పటికీ పుష్కలంగా పంటలు పండిస్తున్న ఇజ్రాయెల్ వంటి దేశాల నుంచి మనం నేర్చుకోవలసిన పద్ధతులు చాలా ఉన్నాయి. అందరికీ ఆహారం న్యాయమైన ధరలకు అందేలా చర్యలు తీసుకోవాలి.

గత మాసం సంపాదకీయంలో పేర్కొన్నట్టు పాఠకులకు మరిన్ని విషయాలను అందజేయాలన్న ఉద్దేశంతోనే మార్పులను ప్రవేశపెడుతున్నాం. ''మన దేశభాషలు నేర్చుకుందాం!'' అనే కొత్త శీర్షికను ఈ సంచికతో ప్రారంభిస్తున్నాం. దీని ద్వారా క్రమక్రమంగా పన్నెండు భాషలలోని కొన్ని ముఖ్యమైన పదాలను నేర్చుకోవచ్చు. తద్వారా ఇతర భాషలను నేర్చుకోవాలనే ఆసక్తి పెరుగుతుంది. ఇతర భాషలను నేర్చుకోవడం విభిన్న సంస్కృతుల అవగాహనకు దోహదం చేస్తుంది. ఈ శీర్షిక గురించీ, తక్కిన అంశాల గురించీ పాఠకుల అభిప్రాయాలను ఆహ్వానిస్తున్నాం!

– సంపాదకుడు



అక్టోబర్ 2009 Rs. 20/-
*Founded by B. Nagi Reddi and Chakrapani*
**Chairman :** B. Viswanatha Reddi (Viswam)
**Editor & Publisher :** Prashant Mulekar
**Associate Editor :** A.R. Balasubrahmanyam
**Senior Artists:** K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
**Artist :** T. Venkatesan
**Asst. Editor-Copy & Pre-Production :** R. Sudha
**Creative Writer :** R. Vaasugi
**Layout Designer :** K. Narendra Raju
**Sanjay B Thorat : Head - Sales and Circulation**
**CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Mobile +91 9821017787
email : sanjay.thorat@chandamama.com
**Rajendra K Jadhav : Asst. Manager - Circulation**
Mobile +91 9320565048
email : rajendra.jadhav@chandamama.com
**New Delhi : Sushil Sharma, Circulation Manager-North,** Mobile +91 99110 91022
**CHANDAMAMA INDIA LTD.,**
Goyal Business Centre, C-23/2 First floor, Connaught Place, New Delhi-110001
**Bangalore : P. Murali, Asst. Circulation Manager - Karnataka ,** Mobile +91 94488 36952
**CHANDAMAMA INDIA LTD.,** 18, 10th Cross, Mayura Street, Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage, Bangalore-560094,
Phone +91 80 6655 1000
email:murali.p@chandamama.com
**Kolkata : Ananth Prakash, Circulation Manager-East,** Mobile +91 98362 82202, 98351 82202
email : ananth.prakash@chandamama.com
**Ahmedabad : Kalpesh Raval, Sales Officer-Circulation** Mobile +91 98245 19946
email : kalpesh.raval@chandamama.com
**Chennai : K. Ravishankar, Sales Officer - Circulation,** Mobile +91 98414 00981
email : ravishankar.k@chandamama.com
**Content Head - Online : Sowmya Bharadwaj**
email : online@chandamama.com
**For Marketing Enquiries :**
email : marketing@chandamama.com
**Advertisement :**
email : sales@chandamama.com
**Subscription Queries:**
e-mail : subscription@chandamama.com
**Customer Cell :** A B Sairam
Mobile: +91 9841983774
e-mail : sairam.ab@chandamama.com
**Production Executive :** Panchakshari R Math
**Head Office : CHANDAMAMA INDIA LTD.,**
2/513 (Old 3/396), Sundeep Avenue East, 2nd Main Road, Chinna Neelankarai, Chennai - 600 041 Phone +91 44 43992828, Fax +91 44 43992829
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

Printed and Published by Prashant Mulekar at Shruti Art Pvt. Ltd., Unit No.1, Gupta Mills Estate, Devidayal Industrial Compound, Darukhana, Reay Road (East), Mumbai - 400 010 on behalf of Chandamama India Limited, 2/513, Sundeep Avenue East, 2nd Main Road, Thiruvanmiyur, Chennai - 600 041. Editor : Prashant Mulekar

# పాఠకుల లేఖలు



చందమామ అంటే మేలిమి కథలకు, జానపద పౌరాణిక సీరియల్స్‌కి పేరెన్నిక కన్నది చందమామ అంటే ఇన్నాళ్ళు ఇష్టము, ప్రస్తుతం కథలు తక్కువై అనవసర శీర్షికలకు ఆలవాలమై చందమామ కంటే మిగిలిన పత్రికలు మేలన్న అభిప్రాయం కలుగుతున్నది. అలాగే మునుపటి క్రమం కొనసాగించండి. జాతక కథ కొనసాగించండి. పాత కథగా 25 ఏళ్ళనాటి కథ ప్రచురించాలి. అలాగే, జోకులు ప్రచురిస్తున్నందులకు ధన్యవాదాలు. జంతు కథలు ప్రచురించండి. – శివలెంక చంద్రశేఖర్, హైదరాబాద్

తెలుగు మాస పత్రికలలో 'చందమామ' అత్యంత ఆకర్షణీయంగా తయారై, మాలాంటి పాఠకులకు ఎంతో మానసిక ఉత్సాహాన్ని తెచ్చి పెడుతుంది. అదే 'చందమామ'లో ప్రత్యేకత. 'పాతాళదుర్గం' సీరియల్ అద్భుతంగా ఉంది. 'రామాయణం'(యుద్ధకాండ) చాలా ఆసక్తికరంగా సాగుతూవుంది. 'గృహలక్ష్మి' కథ బాగా నచ్చింది.
– వజ్రాల హరినారాయణ, హైదరాబాద్-*35*

జూలై చందమామను చదివాను. డబ్బుగల బిచ్చగత్తె వార్త ఆశ్చర్య పరిచింది. ఆధునికమైన చిన్న కథలను(సగంపేజీ) ప్రచురిస్తే బాగుంటుంది. నవ్వుల పువ్వులను బాగా పరిమళింపజేసేందుకు కృషి చేయాలి. – జి. శ్రీశైలం, పెద్ద చెల్మెడ్, మెదక్ జిల్లా-*502345*

## ఎస్ఎంఎస్ ద్వారా

మరిన్ని కథలు కావాలి. బొమ్మల్లో నాణ్యత కొరవడింది. అనునిర్వ, ఆర్య అర్థంకావడం లేదు. – ఉత్తర, ఆం.ప్ర.

చందమామ సంప్రదాయాన్ని కోల్పోతూన్నది. – వివేక్, ఆం.ప్ర.

పాతికేళ్ళనాటి చందమామ కథ కావాలి. – ఇందిర, కర్ణాటక

కొత్తరకం కథలు ఏమీ బాగాలేవు. ముఖ చిత్రాలు మార్చండి.
– ప్రకాష్, ఆం.ప్ర.

మీ అభిప్రాయాలను ఈ-మెయిల్
feedback@chandamama.com
ద్వారా, SMS MLANG <space> <Name, Age> <space> <TEL your feedback> 54646 ద్వారా పంపవచ్చు.



# దీపావళి

## వెలుగుల పండుగ



దీపావళి వచ్చేస్తోంది. చెడుమీద మంచి సాధిం చిన విజయానికి సంకేతంగా ఈ పండుగను జరుపుకుంటున్నామని మనకందరికీ తెలుసు. సాటి మానవప్రేమను ప్రబోధించే విధంగానూ కొందరు ఈ పండుగను జరుపుకుంటారు.

పదిహేడవ శతాబ్దంలో మొగలు చక్రవర్తి జహాంగీర్, గురు హర్‌గోవింద్‌సింగ్‌తో సహా మరో యాభైరెండు మంది రాజులను గ్వాలియర్ కోటలో బంధించాడు. కారాగారవాసం దుర్భ రంగా ఉన్నప్పటికీ వాళ్ళు కలిసికట్టుగా భరిం చసాగారు. కొన్నాళ్ళకు సాయి మియాన్ మీర్ అనే ఒక సూఫీ సన్యాసి జహాంగీరుతో మాట్లాడి, గురు హర్‌గోవింద్‌సింగును విడుదల చేయ మని అభ్యర్థించి ఒప్పించాడు. వెంటనే గురు హర్‌గోవింద్‌సింగును విడుదల చేయమని జహాం గీర్ ఆనతి జారీ చేశాడు. అయితే, తనతోపాటు కారాగారంలో ఉన్న మిగిలిన రాజులందరినీ విడు దల చేస్తే తప్ప, తను ఒక్కడే కోట నుంచి బయట అడుగుపెట్టజాలనని గురు హర్‌గోవింద్‌సింగ్ తేల్చి చెప్పాడు. తనకు లాగే తక్కిన వారికి కూడా స్వతంత్రం ముఖ్యమని ఆయన భావించాడు!

జహాంగీర్ యుక్తిగా ఒక పథకం ఆలోచిం చాడు. యాభైరెండు మంది రాజులూ ఒక్కసారిగా గురువుగారి కండువాను పట్టుకుని వెలుపలికి నడిచేలా ఉంటే వాళ్ళందరినీ నిరభ్యంతరంగా విడుదల చేస్తానని మెలికపెట్టాడు. అదెలా సాధ్య మవుతుంది? ఖైదీలనందరినీ ఎలాగైనా విడు దల చేయించాలని గురు హర్‌గోవింద్‌సింగ్ ఆశించాడు. ఒక మంచి పథకం తట్టింది కూడా! యాభైరెండు చుంగులు ఉండేలా ఒక కండు వాను కుట్టమన్నాడు. ఆ కండువాను పైన వేసు కుని గురువు చెరసాల నుంచి వెలుపలికి నడి చాడు. కండువాకున్న యాభైరెండు చుంగులను పట్టుకుని యాభైరెండు మంది రాజులూ గురు గోవింద్‌సింగును అనుసరించారు. అదో అద్భు తమైన విజయం. తమ ప్రియతమ నాయకుడికి స్వాగతం పలకడానికి అమృతసర్‌లోని స్వర్ణ దేవాలయంలో వందలాది దీపాలను వెలిగిం చారు.

ఈ సంప్రదాయం ఈనాటికీ కొనసాగుతున్నది. శిక్కులు దీపావళిని ఈ విధంగా ఆనందోత్సాహ లతో జరుపుకుంటారు!

మీరెంతో ఉత్సాహంగా జరుపుకునే వెలుగుల పండుగను ప్రపంచవ్యాప్తంగా కోట్లాది మంది జరుపుకుంటున్నారంటే మీ ఆనందం ఇను మడిస్తుంది! అవునా? సురక్షితంగా దీపావళిని జరుపుకోండి! అందరికీ దీపావళి శుభాకాంక్షలు!!

చందమామ

# మేము వింటున్నాం!



కాలంతో పాటు మీ చందమామ కూడా మారింది. పత్రికలో చోటుచేసుకున్న మార్పులను గురించి మీ అమూల్య అభిప్రాయాలకు విలువనిస్తున్నాం. మీ భావాలను మాతో పంచుకోవడానికి మీ సమయాన్ని కొంచెం కేటాయించండి. ఈ ప్రశ్నాపత్రాన్ని నింపడానికి పది నిమిషాల కన్నా ఎక్కువ పట్టదు. ఫీడ్‌బ్యాక్ ఫారంను పూర్తిచేసి పంపే ఐదుగురు అదృష్ట విజేతలకు వాళ్ళుకోరుకునే భాషలో చందమామను మూడు నెలలపాటు ఉచితంగా పంపుతాము.

పేరు: వయసు: ఊరు:

మీరు చందాదారులా? ☐(ఎ)అవును ☐(బి)కాదు

1. నూతన ఫార్మెట్‌లో చందమామ ఎలా ఉంది?
   ☐(ఎ) పాతదానికన్నా బావుంది ☐(బి) పాతదే మేలు ☐(సి) తేడా లేదు
2. పత్రికలో మీకు బాగా నచ్చిన శీర్షిక/కథ ఏది?
   ............................................
3. మీరు ఎలాంటి కథలు చదవాలని ఇష్టపడుతున్నారు?
   ☐(ఎ) పురాణ కథలు ☐(బి) చరిత్ర ☐(సి) చిన్న కథలు
4. కథలు చదవడానికి, అర్థం చేసుకోవడానికి సులభంగా ఉన్నాయా?
   ☐(ఎ) అవును, భాష సులభంగా బావుంది. ☐(బి) భాష అర్థం చేసుకోవడం కష్టంగా ఉంది.
   ☐(సి) ............................................(కథల పేర్లు రాయాలి) కథలు అర్థం చేసుకోవడం కష్టంగా ఉంది.
5. పత్రికను చదివి పూర్తిచేయడానికి సగటున మీకు ఎంత సమయం పడుతుంది?
   ............................................
6. అతి తక్కువగా 1 అత్యధికంగా 10 గల 1-10 స్కేలు మీద కింది విషయాలలో చందమామను గురించిన మీ అంచనా తెలియజేయండి:
   (ఎ) వినోదం ........... (బి) విజ్ఞానం ........... (సి) సమాచారం ............
7. మొత్తంమీద చందమామను గురించి మీ అభిప్రాయం ఏమిటి?
   ........................................................................................
   ........................................................................................

పూర్తి చేసిన ఫారాలను ఈ చిరునామాకు పంపండి:
చందమామ ఇండియా లిమిటెడ్, 2/513, సందీప్ అవెన్యూ ఈస్ట్,
సెకండ్ మెయిన్ రోడ్, చిన్న నీలాంగర్రై, చెన్నయ్-600041.
లేదా మీ సమాధానాలను feedback@chandamama.com కు ఇ-మెయిల్ చేయండి.



## బేతాళ కథలు

# సుమేధుడి దక్షత

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఏ మహత్తర కార్యం సాధించడానికి నువ్విలా శ్రమపడుతున్నావో నాకు తెలియదు. అయితే, మంచి కార్యం సాధించడం కోసమే ప్రతి ఒక్కరూ పట్టుదలతో శ్రమిస్తారని చెప్ప లేము. కొందరు తమ అత్యాశలనే ఆశయా లనుకుని వాటిని సాధించడానికి కుట్రలూ కుయుక్తులతో అపమార్గాలు అవలంబిస్తూ ఉంటారు. అత్యాశతో ఒకనాట్యకారిణి రాజునే మట్టుపెట్టాలని అతి తెలివి ప్రదర్శించి అభా సుపాలయింది. నీకు తగు హెచ్చరికగా ఉండ గలందులకు ఆమె కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్ప సాగాడు:

శ్రీరంగపురాన్ని పాలించే సుచీంద్రవర్మకు సుమేధవర్మ, సుధామవర్మ కుమారులు. వారు



సకల విద్యలనూ నేర్చి సమ ఉజ్జీలుగా పెరిగి యుక్తవయస్కులయ్యారు. వయోభారం పైబడడంతో, వానప్రస్థానికి వెళ్ళదలచిన మహారాజు, పెద్దకుమారుడు సుమేధవర్మకు రాజ్యపట్టాభిషేకం చేయాలని నిర్ణయించాడు. సుమేధవర్మకు అప్పటికే వివాహమయింది.

ఆ సమయంలో మహారాజు ఒకనాడు ఉద్యానవనంలో కూర్చుని ఉండగా అక్కడికి వచ్చిన ప్రధానమంత్రి అంబపతి, ''అన్నద మ్ముల మధ్య కలతలు, అసూయాద్వేషాలు తలెత్తకుండా ఉండాలంటే రాజ్యాన్ని రెండుగా విభజించి, ఇద్దరినీ పట్టాభిషిక్తులను చేయడం మంచిదేమో!'' అన్నాడు వినయంగా.

ఆ మాట వినగానే మండిపడ్డ మహారాజు, ''తరతరాలుగా అవిభాజ్యంగా కొనసాగు తూన్న శ్రీరంగపుర రాజ్యం నా హయాంలో విభజించడం జరగకూడదు. విశాల రాజ్యమే అన్ని విధాలా అభిలషనీయం,'' అన్నాడు.

మంత్రి మరేమీ మాట్లాడలేక మౌనంగా ఉండిపోయాడు. మరుసటి శుభ ముహూర్తం లోనే సుమేధవర్మ రాజ్య పట్టాభిషేక మహో త్సవం వైభవంగా జరిగింది.

దాంతో మంత్రి ఊహించినట్టుగా చిన్న కుమారుడికి కాకపోయినా, అతడు ప్రేమిం చిన అందాల రాశికి అసంతృప్తి చెలరేగింది. ఇంద్రవల్లి ఆమె పేరు. అద్భుతమైన నాట్యకళా కారిణి!

''ధర్మ పరిపాలకుడిగా పేరుగాంచిన మహారాజు తమ కుమారుల పట్ల పక్షపాతంతో వ్యవహరించడం ఏం న్యాయం? రాణి కావాల న్నదే నా జీవితాశయం. నువ్వు రాజువయితేనే నిన్ను వివాహమాడగలను,'' అని నిర్మొహమా టంగా చెప్పింది ఇంద్రవల్లి.

''ప్రేమ వెన్నెలంత స్వచ్ఛమైనదంటారు! మరి నీ ప్రేమలో ఈ పేరాశ ఎలా ప్రవేశిం చింది?'' అన్నాడు సుధాముడు బాధగా.

''ఆశయానికి ప్రేమ అడ్డయితే, దాన్ని వదులుకోవడానికి సైతం వెనుకాడను!'' అన్నది ఇంద్రవల్లి పుల్లవిరుపుగా.

''నువ్వు నాకు కావాలి. ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు?'' అని అడిగాడు సుధా ముడు.

''రాజ్య భాగం ఇవ్వకపోతే, పాండవులు ఏం చేశారో అదే నువ్వు చేయాలి. అధికారం కోసం అడ్డు తొలగించుకోవడం అపరాధం కాదు. అందుకు ఎలాంటి మార్గమైనా అనుస

రించవచ్చు. అంతఃపురంలో పనిచేసే లిఖిత అనే పరిచారిక నా చిన్ననాటి స్నేహితురాలు. ఆమెకు వెయ్యి బంగారు నాణాలు ఇచ్చి, ఇలా చేయమని చెప్పు,'' అంటూ ఇంద్రవల్లి తన పథకాన్ని సుధాముడికి వివరించింది.

దాన్ని వినగానే దిగ్భ్రాంతి చెందిన సుధాముడు మౌనంగా ఉండిపోయాడు.

ఏకాదశి ఉపవాసముండే సుమేధవర్మ రాత్రి పూట ఫలాలు మాత్రమే ఆరగిస్తాడు. ఆ రాత్రి లిఖిత పండ్లు తీసుకు రాగానే, ''రాజునైన నాపైనే విష ప్రయోగం చేయడానికి వస్తున్నప్పటికీ, ఎలాంటి జంకూ కొంకూ లేకుండా ఉన్నావంటే, నువ్వు సామాన్యురాలివి కాదు. ఇదే పని నువ్వు శత్రురాజుల పైన చేసి ఉంటే నిన్ను విలువైన కానుకలతో సత్కరించి ఉండేవాణ్ణి,'' అన్నాడు రాజు.

''మీ ఉప్పుతింటూ, మీ దయాదాక్షిణ్యాల మీద బతుకుతున్నదాన్ని. మీపైనే విష ప్రయోగం చేసేంత క్రూరురాలిని కాను ప్రభూ. వీటిలో ఎందులో విషం ఉందని అనుమానిస్తున్నారో సెలవివ్వండి. దానిని నేనే మొదట తీసుకుంటాను, పాలలోనా? పండ్లలోనా?'' అన్నది పరిచారిక.

''చాలు నీ నటన. పండుకోసే కత్తికి విషం పూసి వుందని నాకు తెలుసు. ఆ కత్తితో నీ మోచేతిని కోసుకో. లేదంటే చిత్రవధ తప్పదు,'' అన్నాడు రాజు.

ఇక తప్పించుకునే మార్గం కనిపించక పరిచారిక అలాగే చేసి ప్రాణాలు కోల్పోయింది. విష ప్రభావంతో నీలం తిరిగిపోయిన



ఆమె కాయాన్ని చూసి అందరూ దిగ్భ్రాంతి చెందారు.

పథకం విఫలం కావడంతో ఇంద్రవల్లి హతాశురాలయింది. అయినా విరక్తి చెందకుండా మరో పథకం ఆలోచించింది.

కొట్టగట్టు గూడెం వాడైన గండడికి రాజు పట్ల తీరని పగ ఉన్నది. వాడి కొడుకు గంగడు భయంకరుడైన గజదొంగ. రాజుకాక ముందే సుమేధుడు గంగణ్ణి వేటాడి పట్టి చంపాడు. అందువల్ల గండడు రాజు మీద పగ తీర్చుకోవడానికి సమయం కోసం ఎదురు చూస్తున్నాడు. ఇంద్రవల్లి వాణ్ణి గురించి సుధాముడికి చెప్పి, ''నువ్వు మారువేషంలో వెళ్ళి గండడికి వెయ్యి బంగారు నాణాలు ఇచ్చి ఇలా చెప్పు,'' అంటూ సుధాముడికి రహస్య పథకం వివరించింది.



వారం రోజుల తరవాత రాజు సుమేధుడు ఒకనాడు నగర పర్యటనకు వెళ్ళి, ప్రజల సమస్యలను ప్రత్యక్షంగా అడిగి తెలుసుకుంటున్నాడు. అదే సమయంలో, అదే వీధిలో ఒక ఎత్తయిన మేడమీద గండడు రహస్యంగా పొంచి వుండి, రాజు రాక కోసం ఎదురు చూస్తున్నాడు. రాజు అటువైపు రాగానే బాణం ఎక్కుపెట్టి ఆయనమీదికి గురిచూసి వదలబోయాడు. అంతలో ఎక్కడి నుంచో రివ్వున దూసుకువచ్చిన బాణం గండడి గుండెలో దూసుకుపోయింది. మేడపైనుంచి కిందపడి వాడు ప్రాణాలు కోల్పోయాడు.

దానిని చూసిన మంత్రి, ''మహారాజా, గండడి వెనక ఎవరో ఉన్నారు. ఇది అంతఃపుర అంతరంగిక సమస్యగా కనిపిస్తోంది. ఆ సమస్యను పరిష్కరిస్తే ఇలాంటి దారుణాలు పునరావృతం కాకుండా జాగ్రత్తపడవచ్చు,'' అన్నాడు ఆత్రుతతో.

''కుట్రదారులెవరో తెలిసిపోయింది. మరో ప్రయత్నం చేశారో రుజువుతో దొరికి పోగలరు. యముడు వారి కోసం ఎదురుచూస్తున్నాడు. నేను భయపడవలసిన పనిలేదు,'' అన్నాడు సుమేధుడు. మంత్రి ఆ తరవాత మరేమీ మాట్లాడకుండా మౌనం వహించాడు.

ఇంద్రవల్లి పట్టు వదలకుండా ఆలోచించి మరో తిరుగులేని పథకాన్ని రూపొందించింది.

ఇంద్రదమనుడనే యువకుడు రాజ్య సరిహద్దుల్లో, రాజ్యాధికారాన్ని సహించకుండా ఒకటి రెండు సార్లు రాజుకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేశాడు. అయినా మహారాజు ఆ తిరుగుబాటును ఉక్కుపాదంతో అణచి వేశాడు. ప్రాణాలతో తప్పించుకున్న ఇంద్రదమనుడు ప్రస్తుతం తీవ్రమైన ఆర్థిక ఇబ్బందుల్లో తన అనుచరులను కాపాడుకోలేక నానా అవస్థ పడుతున్నాడు.

ఆ సంగతి తెలిసిన ఇంద్రవల్లి, అతణ్ణి తాత్కాలికంగా ఉపయోగించుకోవాలని నిర్ణయించింది. సుమేధుణ్ణి మారువేషంలో వెళ్ళి ఇంద్రదమనుణ్ణి కలుసుకుని ధన సహాయం చేసి, తన పనిని అప్పగించమని చెప్పింది.

ఒకనాడు సుమేధుడు అడవికి వేటకు వెళ్ళాడు. మధ్యాహ్నం వరకు వేటాడి, ఒక చెట్టు కింద కూర్చుని సేద తీరుతున్నాడు. అప్పుడు హఠాత్తుగా ఇంద్రదమనుడు మెరికల్లాంటి ఇరవై మంది యువకులతో వచ్చి చుట్టుముట్టి మెరుపుదాడి చేశాడు. రాజు

వెంటనే అప్రమత్తుడై, వీరోచితంగా పోరాడుతూ ఇంద్రదమనుడితో సహా పలువురిని హతమార్చాడు. ఒకే ఒక్కడు మిగలగా వాడు యుక్తిగా రాజును దాపులనున్న మొసళ్ళ కొలనులోకి తోసి పారిపోయాడు.

ఆ క్షణంలో సుమేధుడు చెట్టు చాటు నుంచి పొంచి చూస్తున్న ఇద్దరు వ్యక్తుల్ని పసిగట్టాడు. వారు ఎవరో కాదు. మంత్రి అంబపతి, అతడి కొడుకు శ్రీపతి!

మొసళ్ళ కొలనులో పడిన రాజు మరింత శక్తిని కూడదీసుకుని, తెలివిగా మొసళ్ళ బారి నుంచి తప్పించుకుని సురక్షితంగా బయట పడ్డాడు.



మరునాడు రాజు మంత్రినీ, అతడి కొడుకునూ నిండుసభలో నిలబెట్టి విచారణ జరిపాడు. వాళ్ళే అసలు దోషులని తెలియడంతో ఇద్దరికీ ఉరిశిక్ష విధించాడు.

అసలు జరిగిందేమంటే – ఇంద్రవల్లిపై ప్రేమతో ఆమె మాటలను కాదనలేని సుధామ వర్మ, సోదరప్రేమతో ఆమె చెప్పినట్టు చేయలేని అశక్తుడయ్యాడు. అయితే, మంత్రి అంబపతీ, అతడి కుమారుడూ అంతఃపురంలో తాము నియమించిన సేవకురాలి ద్వారా ఇంద్రవల్లి చెప్పే పథకాలను ఎప్పటికప్పుడు తెలుసుకుని అమలు జరిపారు. దక్షత కలిగిన సుమేధుణ్ణి మొదట హతమార్చి, ఆ తరవాత మృదు స్వభావుడైన సుధాముణ్ణి కూడా మట్టుపెట్టి రాజ్యాన్ని కబళించాలన్నది వాళ్ళ దురాశ. ఒకవేళ పథకం గనక విఫలమయితే నేరం ఇంద్రవల్లి, సుధాముల మీదికి పోతుందన్న ధీమాతో, ఆమె సుధాముడికి చెప్పిన పథకాలను తెరవెనక నుంచి అమలు పరిచారు.

అయితే, సుమేధుడు రాజుకాగానే పలువురు ప్రముఖులపైన పరమ రహస్యంగా నిఘా ఏర్పాటు చేశాడు. అందువల్ల తనను తాను రక్షించుకోవడమే కాకుండా వారి కుట్రలను భగ్నపరచి తగిన సమయంలో బయటపెట్టి శిక్షించగలిగాడు.

తనతమ్ముడు ప్రాణానికిప్రాణంగా ప్రేమించడం వల్ల రాజు ఇంద్రవల్లిని క్షమించి వదిలిపెట్టాడు. ఆ తరవాతసుధాముడితో, "తమ్ముడూ, నీ ప్రేమ గెలవాలి, నేను తప్పుకుని నిన్ను రాజును చేస్తాను," అన్నాడు.

ఆ మాట వినగానే ఇంద్రవల్లి, "మహారాజా, నాకు రాణి కావాలని లేదు. ఉత్తముడైన మీ తమ్ముణ్ణి సంతోషంగా వివాహమాడతాను.

సమర్థులైన మీ పాలనలో మేము క్షేమంగా ఉండగలం. అజ్ఞానంతో దురాశ కొద్దీ నేను చేసిన ఘోర అపరాధాలను క్షమించండి!'' అని వేడుకున్నది. ఇంద్రవల్లి సుధాముల వివాహం వైభవంగా జరిగింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, రాణి హోదా పొందాలన్నది ఇంద్రవల్లి జీవితాశయం. దానిని పొందడానికే ఆమె పలు కుతంత్రాలకు పాల్పడింది. అందులో ఒక్కటీ ఫలించ లేదు. రాజు ఆమె అపరాధాలను క్షమించి, ఆమెకు కాబోయే భర్తకు రాజ్యాభిషేకం చేస్తానంటే ఎందుకు వద్దన్నది? ఇన్ని నేరాలకు పాల్పడిన తను ప్రాణాలతో బయటపడడమే చాలనుకున్నదా? మరేదైనా కారణం ఉన్నదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''పదవి చాలా బాధ్యతాయుతమైనది. దాన్ని కేవలం హోదాగా, అలంకారప్రాయంగా భావించే వారికి ఎన్నటికైనా భంగపాటు తప్పదు. ఉన్నత పదవిలో ఉన్నవారికి, అదీ రాజ్యాధికారం చేపట్టిన వారికి అడుగడుగునా ఆపదలు పొంచి ఉంటాయి. ద్రోహ చింతనగల లిఖిత విష ప్రయోగం నుంచీ, పగబట్టిన గండడి శరాఘాతం నుంచీ, ఇంద్రదమనుడి నాయకత్వంలో విప్లవకారుల మెరుపుదాడి నుంచీ తప్పించుకున్న సుమేధుడు అప్రమత్తతతో కూడిన తన దక్షతను నిరూపించుకున్నాడు. సుధాముడయితే, ఈ మూడింటిలో కనీసం ఒక్కదాని నుంచి కూడా తప్పించుకోగలడా అన్నది అనుమానాస్పదమే. దక్షతగల సుమేధుణ్ణి రాజును చేసి, మహారాజు సుచీంద్రుడు సరైన నిర్ణయం తీసుకున్నాడని ఇంద్రవల్లి గ్రహించింది. దుష్టబుద్ధి లేని ఉత్తముడైన సుధాముడే తనకు తగిన భర్త అని అర్థం చేసుకుని అతడితో వివాహానికి అంగీకరించింది,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. -(కల్పితం)

*[ఆధారం : గుండ్రాతి సుబ్రహ్మణ్యం గౌడు రచన]*




బేతాళుడిపై మళ్లీ విక్రముడిదే పైచేయి. వివరాలకు telugu.chandamama.com చదవండి


9
ఆర్య
మాణిక్య ద్వీప అన్వేషణ
చిత్రాలు: గాంధి అయ్య
థార్విక్-ఆడతోడేలు మధ్య ఉన్న 'స్నేహం' ఆర్యను కలవర పెట్టింది. ఆడతోడేలు మరేకుల మంత్రగత్తె మారిషా అయివుండవచ్చన్న అనుమానం అతనికి కలిగింది.
తను చూసిన వాటిని గురించి ఆలోచిస్తూ, ఆర్య తూరుపు ప్రాంతంకేసి తన ప్రయాణాన్ని కొనసాగించాడు.
పొద్దు గూకడంతో, ఒక చెట్టుకింద రాత్రి విశ్రాంతికి నడుం వాల్చాడు. అలిసిన కన్నులను మూసుకున్నాడు.
తెల్లవారితే ఏం జరుగుతుందో ఏమో?
కొంతసేపటికి ఏవేవో వింత కలలు. తూరుపు దేశంలో కనిపించకుండా పోయిన పిల్లలు. వాళ్ళకేం కావాలి?
రాజుగారు అంధుడు!


చావుపిట్ట
అతడి మనసును
తినేస్తుంది!
బుద్ధిలేని
మనసు!
ప్రభాత్!
నిన్ను నేను
విశ్వసిస్తున్నాను!
మూర్ఖపు రాజా!


ఆర్య కలత నిద్ర నుంచి ఉలిక్కిపడి లేచాడు. కలలో కనిపించిందేమిటి?
థార్విక్! కలలో సైతం నన్ను వెంటాడుతున్నాడు కాబోలు!
వినాశనం విశ్వాసపునీడ!
ఆ పిల్లలు... నన్ను గుడ్డివాడన్నారు.
అతడు తన కళ్ళను ఒకసారి ఖడ్గంలో చూసుకున్నాడు.


నువ్వయినా నిజంగానే విశ్వాసపాత్రమైన జంతువవని తెలుసుకున్నాను.
హఠాత్తుగా...
ఎవరు నువ్వు, నాయనా?
నువ్వు ఎవరు కావాలంటే వాణ్ణే నేను!
కలలను కొట్టి పారేయకూడదని ముందే ఒకసారి హెచ్చరించబడ్డావు!
నువ్వు కనిపించకుండా పోయిన పిల్లలలో ఒకడివి కదా?
(ఇంకావుంది)

## యుద్ధ కాండ - 10

జాంబవంతుడు ప్రేరేపించగా హనుమంతుడు వాయువేగంతో ఆకాశ మార్గాన హిమాలయ పర్వతాలకు పోయి, అక్కడ ఉన్న మంచు శిఖరాలూ, గుహలూ, గొప్ప క్షేత్రాలైన బ్రహ్మకోశమూ, కైలాసమూ, హయగ్రీవమూ, బ్రహ్మకపాలమూ, కుబేరస్థానమూ, పాతాళరంధ్రమూ, కాంచన శృంగమూ చూస్తూ సర్వౌషధి పర్వతం పైన దిగి, ఓషధుల కోసం వెదకసాగాడు. ఆ సంగతి తెలిసి దివ్యౌషధులు అంతర్ధానమయ్యాయి.

హనుమంతుడికి పట్టరాని కోపం వచ్చింది. అతను పెద్దపెట్టున అరిచి పర్వతంతో, ''రాముడి పైన జాలి తలపరాదని నిశ్చయించుకున్నావా ఏమిటి? నిన్ను నా చేతులతో పెరికి, పిండి చేసేస్తాను,'' అన్నాడు. అంటూనే హనుమంతుడు ఆ పర్వత శిఖరాన్ని పెకలించి తిరిగి ఆకాశ మార్గం పట్టాడు.

పర్వత శిఖరంతో సహా తిరిగి వస్తున్న హనుమంతుణ్ణి చూసి వానరులు గట్టిగా అరిచారు. హనుమంతుడు ఓషధి పర్వతంతో సహా త్రికూట పర్వతం మీద వానర సేన మధ్య వాలి, ప్రముఖ వానరులకు నమస్కారాలు చేసి, విభీషణుణ్ణి కౌగిలించుకున్నాడు. రామలక్ష్మణులూ, ఇతర వానర వీరులూ దివ్యౌషధుల వాసనకు బాణాల బాధ పోగొట్టుకున్నారు. యుద్ధంలో చచ్చిపోయిన వానరులు సైతం దివ్యౌషధుల గాలి సోకగానే నిద్ర లేచినట్టు లేచి కూర్చున్నారు. హనుమంతుడు ఓషధి పర్వత శిఖరాన్ని తీసుకుపోయి యథాస్థానంలో ఉంచి తిరిగి వచ్చాడు.





అప్పుడు సుగ్రీవుడు హనుమంతుడితో, ''తమ్ముడైన కుంభకర్ణుడూ, కొడుకులూ చచ్చారు గనుక ఇప్పుడు రావణుడు యుద్ధానికి రాడు. మనలో బల వేగాలు గల వానరులు ఈ రాత్రి దివిటీలు తీసుకుని వెళ్ళి లంకపై పడాలి,'' అన్నాడు.

సూర్యాస్తమయమై భయంకరమైన రాత్రి రాగానే వానర వీరులు దివిటీలు పట్టుకుని లంకకేసి వెళ్ళారు. వారి ధాటికి బెదిరి నగర ద్వార రక్షకులైన రాక్షసులు పారిపోయారు. తమను అడ్డేవారెవరూ లేక, వానరులు నగరం ప్రవేశించి, ద్వారాలలోనూ, బురుజులలోనూ, రాజ వీధులలోనూ, ఇతర వీధులన్నిటా నిప్పు పెట్టారు. లంక అంతా అంటుకుని తగలబడ సాగింది. ఆకాశమంత ఎత్తున్న మేడలు కాలి, కూలిపోయాయి. ఇళ్ళతో బాటు విలువగల వస్తువులూ, వస్త్రాలూ, శాలువలూ, రత్నకంబళాలూ, నగలూ, ఆయుధాలూ, కవచాలూ, సమస్తమూ తగలబడిపోయాయి. అనేక మంది రాక్షసులు కాలిపోయారు. రాక్షస స్త్రీలు హాహాకారాలు చేశారు. గుర్రాలూ, ఏనుగులూ కట్లు తెంచుకుని బీభత్సంగా పరిగెత్తాయి.

తగలబడిపోతున్న లంకానగరం సముద్రంలో ప్రతిబింబించి సముద్రం కూడా ఎర్రగా కనబడింది.

ఒక వంక వానరులు సంతోషంతోనూ, రాక్షసులు దుఃఖంతోనూ కేకలు పెడుతూంటే, రెండు ధ్వనులనూ మించి రాముడి బాణం చేసే ధ్వని వినపడింది. అది విని రాక్షసులు యుద్ధానికి సిద్ధపడ్డారు.

రావణుడి అంతఃపుర ద్వారం వద్దకు వెళ్ళి యుద్ధం చేయవలసిందిగా సుగ్రీవుడు వానరోత్తముల నాజ్ఞాపించాడు. వానరులు దివిటీలతో సహా ద్వారంలో నిలబడటం రావణుడు చూసి మండిపడి, ఆ వానరులను చంపిరమ్మని నికుంభుడూ, కుంభుడూ అనే వాళ్ళను, కుంభకర్ణుడి కొడుకులను పంపాడు. వాళ్ళు అనేక మంది రాక్షసు వీరులను వెంటబెట్టుకుని బయలుదేరి వచ్చారు. వానరులకూ రాక్షసులకూ తీవ్రమైన యుద్ధం జరిగింది. అనేక మంది రాక్షస వీరులు చచ్చారు. అంగదుడు మూర్ఛపోయాడు. చివరకు కుంభుడు సుగ్రీవుడి చేతిలో చచ్చాడు. అతని తమ్ముడైన నికుంభుణ్ణి హనుమంతుడు దారుణంగా చంపేశాడు. కుంభ నికుంభులు చావగానే

వానరులు సింహనాదాలు చేశారు. రాక్షసులు భయపడ్డారు.

తరవాత రావణుడు వానరులతో యుద్ధం చెయ్యటానికి ఖరుడి కొడుకైన మకరాక్షుణ్ణి వెళ్ళమన్నాడు. మకరాక్షుడు రాక్షస సేనతో సహా రామ లక్ష్మణులతో యుద్ధం చెయ్యటానికి బయలుదేరి వెళ్ళాడు. రాక్షసుల బాణ వర్షం ముందు తాళలేక వానరులు పారిపోయి వస్తుంటే వెంట తరుముకుంటూ వచ్చే రాక్షసులను రాముడు తన బాణాలతో నిలవేశాడు. తన తండ్రి అయిన ఖరుణ్ణి చంపినందుకు రాముణ్ణి చంపి పగ తీర్చుకుంటానని మకరాక్షుడు ప్రగల్భాలాడాడు.



''మాటలతో విజయం కలగదు! యుద్ధం చెయ్యి,'' అన్నాడు రాముడు. ఇద్దరూ తలపడి భయంకరమైన యుద్ధం చేశారు. మకరాక్షుడు తన సారథినీ, గుర్రాలనూ, రథాన్నీ పోగొట్టుకుని చివరకు రాముడు ప్రయోగించిన ఆగ్నేయాస్త్రంతో చచ్చి పడిపోయాడు. అతని వెంట ఉన్న రాక్షసులందరూ నగరంలోకి పారిపోయారు.

మకరాక్షుడి మరణ వార్త విని రావణుడు కోపోద్రేకంతో పళ్ళు పటపట కొరికి, తన కొడుకైన ఇంద్రజిత్తును పిలిచి, ''నాయనా దృశ్యంగానో, అదృశ్యంగానో రామలక్ష్మణులతో యుద్ధం చేసి, వాళ్ళను చంపిరా! ఇంద్రుణ్ణి గెలిచిన నీకీ మానవమాత్రులొక లెక్కా?'' అన్నాడు.

ఇంద్రజిత్తు తండ్రి ఆజ్ఞ పొంది యజ్ఞశాలకు వెళ్ళి, హోమం చేసి, ఒక నల్ల మేకను బలి ఇచ్చాడు. అగ్నిహోత్రం చక్కగా ప్రజ్వలించి విజయం సూచించింది. ఇంద్రజిత్తు అదృశ్యశక్తి గల తన రథమెక్కి, యుద్ధరంగానికి వెళ్ళి, వానర సేనలో ఉన్న రామలక్ష్మణులను గుర్తించి, వారిపై బాణాలు వర్షం లాగా కురిపించసాగాడు. ఇంద్రజిత్తు ఆకాశంలో ఎటుగా ఉన్నదీ కానరాక, రామలక్ష్మణులు ఆకాశ మంతా బాణాలతోనూ, దివ్యాస్త్రాలతోనూ నింపేశారు.

ఇంద్రజిత్తు వేసే బాణాలు ఎటునుంచి వస్తున్నదీ కనిపెట్టి, రామలక్ష్మణులు అటుగా తమ బాణాలను ప్రయోగించారు. అయితే ఇంద్రజిత్తు ఆకాశమంతటా సంచరిస్తూండటం చేత వారి బాణాలతనికి తగల లేదు. ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణాలతో రామలక్ష్మణుల శరీరాల రక్తప్రవాహాలు కారాయి.



వానరులు గుంపులు గుంపులుగా చచ్చారు. లక్ష్మణుడికి కోపం వచ్చి, ''బ్రహ్మాస్త్రం ప్రయోగించి రాక్షసులనందరినీ చంపేస్తాను,'' అన్నాడు.

''ఒక్కడి కోసం, మనతో యుద్ధం చెయ్యని వారందరినీ చంపటం ఉచితం కాదు. ఇంద్రజిత్తునొక్కణ్ణే చంపుదాం,'' అన్నాడు రాముడు.

అంతలో ఇంద్రజిత్తు ఒక మాయ ఆలోచించాడు. అతనొక మాయాసీతను చేసి, ఆమెను రథం మీద పెట్టుకుని, వానరులు చూస్తుండగా ఆమెను చంపి, రామలక్ష్మణులకు మనస్తాపం కలిగించే ఉద్దేశంతో వానరసేన కెదురుగా వచ్చాడు. ఇంద్రజిత్తు కళ్ళకు కనపడగానే వానరులు యుద్ధోత్సాహం చెందారు. హనుమంతుడు ఒక పెద్ద పర్వత శిఖరం పట్టుకుని వానరులకు ముందు నిలబడ్డాడు.

అంతలో హనుమంతుడికి ఇంద్రజిత్తు రథంలో సీత కనిపించింది. ఆమె మాసిన బట్ట కట్టుకుని, దుమ్ముకొట్టుకుని, దీన వదనంతో, తాను కొద్ది కాలం క్రితం చూసినట్టుగానే ఉన్నది. సీత ఇంద్రజిత్తు రథంలో ఉండటం చూసి హనుమంతుడు చాలా బాధపడి, ఏ ఉద్దేశంతో ఇంద్రజిత్తు ఆమెను తెస్తూ ఉండి ఉంటాడా అని ఆలోచించి, పక్క వారిని అడుగుతుండగా ఇంద్రజిత్తు మాయా సీతను జుట్టు పట్టుకుని, కత్తితో కొట్టాడు. ఆమె ''రామా! రామా!'' అంటూ ఏడ్చింది.

హనుమంతుడు ఇంద్రజిత్తు ముందుకు వెళ్ళి, అతన్ని నానా తిట్లూ తిట్టి, ''ఈ సీత నీకే విధమైన అపకారం చేసింది? ఆమెనెందుకు చంప జూస్తున్నావు?'' అని అడిగాడు.

''ఈ సీత మూలానే గదా సుగ్రీవుడూ, రాముడూ ఈ లంకకు వచ్చారు? ఈమెను ఇప్పుడు నీ ఎదుటే చంపి, ఆ తరవాత రాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ, నిన్నూ, సుగ్రీవుణ్ణీ, ఆచారం పోగొట్టుకున్న ఆ విభీషణుణ్ణీ చంపేస్తాను,'' అన్నాడు ఇంద్రజిత్తు. వెంటనే అతను తన చేతి కత్తితో మాయాసీతను నరికేశాడు.

''నీ కళ్ళ ఎదుటనే సీతను చంపేశాను. ఇక మీ ప్రయత్నమంతా వృథా!'' అంటూ ఇంద్రజిత్తు పెద్ద పెట్టున సింహనాదం చేశాడు. వానరులు భయపడి పారిపోసాగారు.

అప్పుడు హనుమంతుడు వారితో, ''ఎక్కడికి పారిపోతారు? మీ పరాక్రమమంతా ఏమయింది? నేను ముందు నడుస్తాను, నా వెంట

రండి,'' అని అందరినీ యుద్ధోన్ముఖులను చేశాడు. అందరూ కలిసి రాక్షస సేనపై పడి చంప నారంభించారు.

హనుమంతుడు ఒకవైపు దుఃఖంతోనూ, మరొకవైపు కోపంతోనూ తపించిపోతూ ఇంద్ర జిత్తు పైన ఒక పెద్ద శిల విసిరాడు. కాని అది అతనికి తగలలేదు. అయినా వానరులు హనుమంతుడి చర్యతో ఉత్సాహం వచ్చి రాక్షస సైన్యాన్ని మట్టుబెట్టసాగారు.

హనుమంతు డప్పుడు తోటి వానరులతో, ''మనం ఏ సీత కోసం వచ్చామో, ఎవరి కోసం ప్రాణాలొడ్డి యుద్ధం చేస్తున్నామో, ఆ సీత కాస్తా చంపబడింది. ఇంద్రజిత్తు సీతను చంపాడన్న వార్త రాముడికీ, సుగ్రీవుడికీ చెప్పి, వారేం చెయ్యమంటే అది చేద్దాం,'' అన్నాడు. వానరులు వెనక్కు తిరిగి వెళ్ళిపోయారు. వారలా వెళ్ళిపోవటం చూసి ఇంద్రజిత్తు హోమం చెయ్యటం కోసం నికుంభిళ చైత్యా నికి వెళ్ళాడు.

ఈ లోపల రాముడికి పశ్చిమ ద్వారం వైపు నుంచి యుద్ధ కోలాహలం వినిపించింది. అతను జాంబవంతుడితో, ''మన హనుమం తుడు రాక్షసులతో పెద్ద ఎత్తున యుద్ధం చేస్తున్నట్టున్నది. అతనికి సహాయం వెళ్ళు,'' అన్నాడు. జాంబవంతుడు పశ్చిమ ద్వారం దిక్కుగా వెళుతూంటే దారిలో హనుమం తుడూ, ఇతర వానర వీరులూ ఎదురుగా రావటం చూశాడు.

హనుమంతుడు యుద్ధరంగానికి బయలు దేరిన భల్లూక సేనను వెనక్కు మళ్ళమని



చెప్పి, త్వరగా రాముడున్న చోటికి వెళ్ళి, తన ఎదుటనే ఇంద్రజిత్తు సీతను చంపేసినట్టు చెప్పాడు.

ఈ మాట వింటూనే రాముడు మొదలు నరికిన చెట్టు లాగా పడిపోయాడు. దూర దూరంగా ఉన్న వానరులందరూ పరిగెత్తుకొ చ్చారు. రాముడి ముఖాన నీరు చల్లారు. లక్ష్మణుడు రాముణ్ణి ఓదార్చాడు. రాముడు లక్ష్మణుడి తొడపై తల పెట్టుకుని ఎంతో దుఃఖించాడు.

అంతలో అక్కడికి విభీషణుడు తన నలు గురు మంత్రులతోనూ వచ్చి, ''అందరూ విచారంగా ఉన్నట్టున్నారే? ఏమిటి కారణం?'' అని అడిగాడు.

''ఇంద్రజిత్తు సీతను చంపేసినట్టు హను మంతుడు వచ్చి చెప్పేసరికి రాముడు దుఃఖ

రామాయణం క్విజ్ ఆగస్ట్ 2009
సరైన సమాధానం: C
విజేతకు అభినందనలు: శరణ్య, హైదరాబాద్.

పడుతున్నాడు,'' అని లక్ష్మణుడు విభీషణుడితో అన్నాడు.

''అదంతా వట్టిమాట, రావణుడు సీతకు అంత కీడు ఎన్నటికీ జరగనివ్వడు. సీతను రాముడి కిచ్చెయ్యమని నే నెంత చెప్పినా సీతను విడిచి ఉండటానికి అంగీకరించని వాడు సీతను చంపనిస్తాడా? ఇంద్రజిత్తు సీతను చూడనైనా లేడు, వాడామెను తెచ్చి చంపగలడా? ఇప్పుడు రావణుడికి ఆ ఇంద్రజిత్తు తప్ప మరెవడూ లేడు. ఇంద్రజిత్తు విజయం కోసం హోమం చెయ్యటానికి నికుంభిళానికి వెళతాడు. ఈ లోపల వానరులు వచ్చి తనకు యజ్ఞ భంగం కలగ చెయ్యకుండా చెయ్యటాని కేదో మాయ పన్నాడు. ఆ మాయ పారింది. మీరంతా పుట్టెడుదుఃఖంలో ఉన్నారు. అక్కడ వాడు నిర్విఘ్నంగా హోమం పూర్తి చేస్తాడు. ఆ తరవాత దేవతలూ, దానవులూ ఏకమై ఎత్తి వచ్చినా వాడి ముందు నిలవలేరు.

చందమామ రామాయణం క్విజ్

ఇంద్రజిత్తు హోమం చేసిన ప్రదేశం పేరేమిటి?

a. పాతాళరంధ్రం b. బ్రహ్మకోశం

c. నికుంభిళచైత్యం

మీ సమాధానాన్ని CRQ <a/b/c> <space> <Name, Lang, Place> ఫార్మెట్‌లో 54646కు SMS చెయ్యండి. ఎంపిక చేయబడ్డ ఒక అదృష్ట విజేతకు కామిక్ కాంబో ప్యాక్ అందజేస్తాం.




కనక నేను చెప్పే దేమంటే, వాడా హోమం పూర్తి చేసేలోగా మనం నికుంభిళానికి పోదాం. రామా! నిర్విచారంగా నీ విక్కడే ఉండి, మా వెంట లక్ష్మణుణ్ణి పంపించు. అతను ఇంద్రజిత్తును చంపగలుగుతాడు. ఏమాత్రమూ ఆలస్యం లేకుండా బయలుదేరాలి,'' అన్నాడు విభీషణుడు.





## పసిఫిక్ దీవుల జానపద కథ

# నెమలి నేర్పిన మాట

దక్షిణ సముద్రంలోని ఒక దీవిలో పాంగో అనే యువకుడు ఉండేవాడు. అతడు మంచివాడూ, దయాస్వభావుడే గాని పరమ సోమరి. ఇరుగు పొరుగు వారు పెట్టే తిండి తింటూ పొద్దస్తమానం ఇంట్లో ముసుగుదన్ని పడుకునేవాడు. పనీ పాటూ తలుచుకునేవాడు కాడు. ఎవరైనా దాన్ని గురించి ప్రస్తావించినా పెద్దగా పట్టించుకునేవాడు కాదు. ఆవులిస్తూ నిద్రను ఆహ్వానించేవాడు. అయినా, ఎన్నాళ్ళిలా సాగుతుంది? తాము తిండి పెడుతున్నంతకాలం పాంగోలో మార్పురాదని గ్రహించిన ఇరుగుపొరుగు, తామిక ఆహారం ఇవ్వమనీ తిండికి ఏదో పని చూసుకుని బతక మనీ పాంగోకు నిష్కర్షగా చెప్పేశారు.

పాంగో మరో మార్గం కనిపించక పనిని వెతు క్కుంటూ ఇంటి నుంచి బయలుదేరాడు. చాలా దూరం నడిచాడు. ఆకలి దహిస్తోంది. ఒక ఇంటి నుంచి వంట చేసేవాసనలు రావడంతో వెళ్ళి తలుపు తట్టాడు. లోపలనున్న ముసలా విడ అతణ్ణి సాదరంగా ఇంట్లోకి పిలిచి ఆహారం పెట్టింది. భోజనం ముగించి, పాంగో తన గురించి ముసలావిడకు వివరించి, డబ్బు సంపా దించే మార్గం ఏదైనా చెప్పమన్నాడు. ముసలావిడ ఏదో గుర్తు చేసుకుంటూ, ''పాంగో, ఒక సంచీ నిండుగా బంగారం, మరో సంచీ నిండుగా అందమైన బట్టలు బహుమతిగా లభిస్తే ఎలా ఉంటుంది?'' అని అడిగింది.

''ఆ బహుమతే గనక వస్తే, నేను జీవితాంతం సంతోషంగా గడిపేస్తాను. అందుకు నేనేం చెయ్యాలి?'' అని అడిగాడు పాంగో ఉత్సాహంగా.

''రాజకుమారుడికి కొన్నాళ్ళుగా నోట మాట రావడం లేదు. యువరాజు మౌనం రాజుకు తీరని విచారం కలిగిస్తోంది. యువరాజును మాట్లాడేలా చేయగలవారికి సంచీ నిండుగా బంగారం, దుస్తులూ బహూకరిస్తానని రాజుగారు ప్రక టించారు,'' అన్నది ముసలావిడ.



''యువరాజుకు మాట తెప్పించడా నికి నేనేదైనా మార్గం ఆలోచిస్తాను. ఈ సమాచారం అందించినందుకు చాలా కృతజ్ఞతలు!'' అంటూ అక్కడి నుంచి బయలుదేరాడు పాంగో.

బహుమతి అవసరం తనకు చాలా ఉంది గనుక, దాన్ని ఎలాగైనా అందుకోవాలి. అందుకు యువరాజుకు మాట తెప్పిం చాలి. అది ఎలాగా అని తీవ్రంగా ఆలో చిస్తూ పాంగో నడవసాగాడు. దారిలో ఒక



వృద్ధుడు పెద్దమూటను తలపైకి ఎత్తుకోవడానికి కష్టపడుతూండడం కనిపించింది. పాంగో వెంటనే వెళ్ళి ఆ మూటను వృద్ధుడు తలపైకి ఎత్తుకోవ డానికి సాయపడ్డాడు. ఇద్దరూ కలిసి మాట్లాడు కుంటూ కొంతదూరం నడిచారు.

''ఎక్కడికి వెళుతున్నావు నాయనా?'' అని అడిగాడు వృద్ధుడు. ''రాజును దర్శించి, రాజ కుమారుణ్ణి మాట్లాడేలా చేయడానికి వెళు తున్నాను,'' అన్నాడు పాంగో.

వృద్ధుడు చిన్నగా నవ్వుతూ, ''దాన్ని నువ్వెలా చేయాలనుకుంటున్నావు?'' అని అడిగాడు.

''ఏదైనా మార్గం కనిపించకుండా పోతుందా అన్న ధైర్యంతో వెళుతున్నాను,'' అన్నాడు పాంగో.

''అలా అయితే, నా చిన్న సాయం కూడా అందుకో. అత్యంత మధురమైన కంఠస్వరం గల పక్షినో, జంతువునో వెంటబెట్టుకుని వెళ్ళి దాని స్వరాన్ని యువరాజుకు వినిపించు. అతడు కూడా అదే కంఠస్వరంతో మాట్లాడ గలుగు తాడు!'' అన్నాడు వృద్ధుడు.

పాంగో సంతోషంగా కృతజ్ఞతలు చెప్పాడు.

''అయితే, ఒక్క విషయం గుర్తుంచుకో అలాంటి జంతువు తన తియ్యటి కంఠస్వరాన్ని ఇచ్చేసి, మామూలు కంఠస్వరం పొందడా నికి సిద్ధంగా ఉండాలి సుమా,'' అని హెచ్చ రించి వృద్ధుడు తన దారిన వెళ్ళిపోయాడు.

పాంగోకు మొదట ఒకపంది ఎదురయింది. పాంగో దాని తలను మృదువుగా నిమురుతూ, ''పందీ, పందీ నీ కంఠస్వరం కాస్త వినిపిస్తావా?'' అని అడిగాడు.

పంది సరేనన్నట్టు గుర్‌గుర్ మంది. పాంగో తల ఊపి, ''బాగానే ఉంది. నువ్వు నాతో యువరాజు దగ్గరికి వస్తావా?'' అన్నాడు. పంది అతడి వెంట బయలుదేరింది.

ఆ తరవాత పాంగోకు ఒక కోడిపుంజు, మేక ఎదురుపడ్డాయి. పాంగో వాటి కంఠస్వరాలను కూడా విన్నాడు. కోడి కొక్కొక్కొ.. అన్నది. మేక మే.. మే.. అన్నది. పాంగో తల గోక్కున్నాడు. అందమైన కంఠస్వరమేదో నిర్ణయించలేకపో యాడు. ఆ రెండింటిని కూడా తన వెంట రమ్మ న్నాడు. మరి కొంత దూరం ముందుకు వెళ్ళే సరికి అతడికి మృదుమధురమైన కంఠస్వరం వినిపించింది! అలాంటి కంఠస్వరాన్ని అంతకు ముందెన్నడూ అతడు విని ఉండలేదు. ఆ కంఠ స్వరం వినిపించిన దిక్కుకేసి పరిశీలనగా చూశాడు. ఒక చెట్టుకొమ్మపై కూర్చున్న నెమలి మళ్ళీ అదే మధుర కంఠస్వరాన్ని వినిపించింది. ''నీ కంఠ స్వరం లాంటి మధుర స్వరాన్ని నేను ఎన్నడూ వినలేదు. నీ కంఠస్వరం వినగానే యువరాజు తప్పకుండా మాట్లాడ గలడు. నువ్వు నాతో వస్తావా?'' అన్నాడు పాంగో ఉత్సాహంగా.

నెమలి ఆనందంతో ఉబ్బితబ్బిబ్బై అలాగే వస్తానని అతనివెంట బయలుదేరింది.

పాంగో ఆ నాలుగు ప్రాణులను వెంటబెట్టు కుని రాజభవనం చేరి రాజును దర్శించి, ''రాజా! తమ కుమారుడు ఇంకా మాట్లాడలే దని విన్నాను. ఆయన్ను మాట్లాడేలా చేయడా నికి నేను వచ్చాను,'' అన్నాడు.

''నిజంగానా! ఎలా చేస్తావు?'' అని అడిగాడు రాజు.

పాంగో తనవెంట వచ్చిన వాటిని చూపుతూ, ''ప్రభూ, నా నేస్తాలను వాళ్ళ అద్భుతమైన కంఠస్వరంతో యువరాజు ఎదుట పాడడానికి అనుమతించండి. అత్యంత మధురమైన వాటి గానాన్ని వినగానే యువరాజు కూడా పాడడం ప్రారంభిస్తాడు. ఆయనకు పోయిన కంఠస్వరం తిరిగి వస్తుంది!'' అని వివరించాడు.

రాజు అందుకు సమ్మతించి కొడుకును తొడపై కూర్చోబెట్టుకున్నాడు. వాళ్ళు మొదట మేక, పంది, కోడిపుంజు పాడిన పాటలను విన్నారు. వాటిని వినడానికి యువరాజు ఎంతో ఆసక్తిని కనబరచాడు. అయితే, నెమలి పాడడం ప్రారంభించగానే ఏకాగ్రతతో వింటూ కదలా మెదలక కూర్చున్నాడు. పాటను వింటూ తన్మ యత్వం చెందాడు. పాట ముగిసే సమయంలో తనూ ఆ పాటతో గొంతుకలిపి అద్భు తంగా మొట్టమొదటిసారిగా పాడడం ప్రారంభించాడు. రాజు పరమానందంతో కొడుకును ముద్దాడాడు. ''ఆహా!'' అంటూ చప్పట్లు కొట్టాడు. పాంగో కళ్ళముందు విలువైన బహుమతులు కదలాడాయి. ఉన్నట్టుండి ఆగ్రహంతో నిండిన ఏడుపు విని రాజు, రాజకుమారుడు, పాంగో నెమలికేసి అమితాశ్చర్యంతో చూశారు.

పాంగోకు వృద్ధుడి మాటలు జ్ఞాపకం వచ్చాయి. కంఠస్వరం ఇవ్వడానికి సంసిద్ధమేనా అని తను నెమలిని అడగనే లేదు. నెమలి కోపంగా పాంగోకేసి చూసింది. రాజు సందిగ్ధంలో పడ్డాడు. ప్రకటించిన విధంగా తన బిడ్డకు మాట తెప్పించిన పాంగోను బహుమతితో సత్కరించాలి. అదే విధంగా బాధతో కుమిలిపోతూన్న నెమలికి న్యాయం సమకూర్చాలి.

కొంతసేపు ఆలోచించిన రాజు ఒక నిర్ణయా నికి వచ్చాడు. ''పాంగో, ప్రకటించిన విధంగా నీకు సంచీ నిండుగా బంగారం ఇస్తాను. అయితే దుస్తులను నెమలికి ఇస్తాను,'' అన్నాడు.

పాంగో సరేనన్నట్టు సంతోషంగా వంగి నమ స్కరించి బంగారం అందుకున్నాడు. రాజు ఇచ్చిన అందమైన రంగురంగుల ఈకలతో చేయబడ్డ అద్భుతమైన నూతన వస్త్రంలో నెమలి మనో హరంగా కనిపించింది. ఆనందంతో నాట్యం చేయసాగింది. కీచు కంఠస్వరం ఉన్నప్పటికీ నెమలి పక్షులన్నిటి కన్నా అందమైన పింఛం కలిగి ఉండడానికి అదే కారణమయింది!




జాతక కథలు
పునఃకథనం: చందమామ
గజరాజు
అడవిలో కళ్ళు లేని తల్లి ఏనుగుతో కలిసి గజరాజు అనే ఒక తెల్ల ఏనుగుపిల్ల నివసిస్తూండేది.
అమ్మా, ఇదిగో నీ కోసం పండు తెచ్చాను!
తక్కిన ఏనుగులు గజరాజును తెగ ఆట పట్టించేవి.
ఆహా, తల్లికి తగ్గ తనయుడు!
ఇంతకన్నా మంచి పండేదీ నీకు దొరకలేదా?
వీళ్ళ పరిహాసాలు నేనిక భరించలేను...
ఆనాటి రాత్రే అడవిని వదిలిపెట్టాలని గజరాజూ, దాని తల్లీ అక్కడి నుంచి బయలుదేరారు.
చాలా దూరం నడిచాక ఒక పెద్ద తటాకం సమీపంలో వాటికొక తోట కనిపించింది. అక్కడే ఉంటూ ప్రశాంతంగా, సంతోషంగా రోజులు గడపసాగాయి.



ఇలా ఉండగా ఒకనాడు...
నా దారి తప్పాను. కాపాడండి!
ఎవరో మనిషి ఆర్తనాదంలాగుంది!
అయ్యో దేవుడా! మదపుటేనుగు! నా పని అయిపోయింది!
భయపడకు! నేను నీకు సాయపడడానికే వస్తున్నాను.
నా పేరు వీరయ్య. దారి తప్పాను. బయటపడే దారి చూపగలవా?
గజరాజు అతణ్ణి తనవీపు పైకి ఎక్కించుకుని ఇంటికి చేర్చాలనుకున్నది. అయితే, వీరయ్య అది ఉన్నచోటు గుర్తుంచుకుని తన లాభానికి దాన్ని ఉపయోగించుకోవాలనుకున్నాడు.
నగర ద్వారం దగ్గరికి రాగానే, వీరయ్య కిందికి దూకి గజరాజుకు కనీసం కృతజ్ఞత కూడా చెప్పకుండా, రాజును చూడడానికి పరిగెత్తాడు.
(ఇంకావుంది)

# వేగ సూత్రం

## ఈ నెల సమస్య:



ఐస్‌క్రీములు అమ్మే వ్యాపారి వద్ద 6 ఫ్లేవర్ల ఐస్‌క్రీములు ఉన్నాయి. అవి 25 వెన్నిలా, 45 చాక్లెట్, 30 స్ట్రాబెర్రీ, 53 బట్టర్‌స్కాట్చ్, 28 ఆరంజ్, 32 పిస్తా. అతడు 4 కుటుంబాలకు, 3 ఆఫీసులకు, 2 రెస్టారెంట్లకు సమసంఖ్యలో ఐస్‌క్రీములు సరఫరా చేస్తానని మాట ఇచ్చాడు. మిగిలిన ఐస్‌క్రీములను ఇంటికి తీసుకెళ్ళి తన ఇద్దరి పిల్లలకు సమానంగా ఇవ్వాలనుకున్నాడు. పిల్లలకు ఎన్నేసి ఐస్‌క్రీములు వస్తాయి. ఈ సమస్య పరిష్కారానికి దగ్గరి వేగ సూత్రం ఏది?

మీ వేగసూత్రాన్ని సెప్టెంబర్30వ తేదీ లోగా మాకు రాసి పంపండి. అత్యంత వేగవంతమైన సూత్రానికి బహుమతి రూ. 500.విజేతలు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్కరికి రూ. 100/- ఇవ్వబడుతుంది.

మీ ఎంట్రీలను పంపవలసిన చిరునామా:
ఎడిటర్, చందమామ ఇండియా లిమిటెడ్, 2/513, సందీప్ అవెన్యూ ఈస్ట్,
సెకండ్ మెయిన్ రోడ్, చిన్న నీలాంగ్రై, చెన్నయ్-600041.
లేదా contests@chandamama.com కు ఇ-మెయిల్ చేయండి.

*గమనిక: ఈ సమస్యకు వేగవంతమైన వేదగణిత సూత్రం డిసెంబర్ సంచికలో ప్రచురించబడుతుంది.*

---

ఆగస్ట్ నెల సమస్యకు సరైన సమాధానాలు గల ఎంట్రీలు రాలేదు.

ఇదీ సరైన సమాధానం:

స్టెప్ *1:* మామిడికాయలు గల చెట్లు
=68-6-13=49

స్టెప్ *2:* కోసిన మొత్తం మామిడి కాయలు
= 49X49

తెలిసినవర్గం గల సంఖ్యకు ఒకటి తక్కువగా ఉన్న సంఖ్య (అంటే 10, 20, 30, ... సంఖ్యల వర్గాలు లెక్కగట్టడం సులభం) వర్గం కనుగొనే వేగవంతమైన మార్గం ఇది:

1. తెలిసిన వర్గం అంటే 2500 రాసుకోవాలి. ($49^2$కు తెలిసిన దగ్గరి వర్గం $50^2$)
2. ఇప్పుడు వర్గం లెక్కగట్టవలసిన సంఖ్యను తెలిసిన వర్గం గల సమీప సంఖ్యకు కలపాలి.
49+50=99
3. 49 వర్గం తెలుసుకోవడానికి 2500 నుంచి 99 తీసివేయాలి!
2500-99=2401

*గమనిక:* ఈ లెక్కను వేగంగా వేయడానికి $(a-b)^2$ సూత్రాన్ని కూడా ఉపయోగించవచ్చు.

శ్యామ్‌కు కోసినవాటిలో 1/10మామిడికాయలు వస్తాయి. అంటే

1/10X2401=240

రామ్‌కు 2401-240=2161 మామిడి కాయలు వస్తాయి.

## కాగితం హెలికాప్టర్





ఏమేం కావాలి?

- స్టిఫ్ పేపర్ (ముతక కాగితం)
- పెన్సిల్
- కత్తెర
- పేపర్ క్లిప్.

తయారు చేయడం ఎలా?

- చూపిన విధంగా పేపర్ మీద రూపాన్ని ట్రేస్ చేసుకోండి.
- బొమ్మలో చూసిన విధంగా గీతల మీదుగా, ముడ తల మీదుగా, చుక్కల గీతల మీదుగా కత్తిరించుకోండి.
- A ను మీవైపుకు B ని అవతలి వైపుకు వంచండి. గిరగిర తిరిగే దిశ మారే విధంగా రివర్స్ చేసుకోవచ్చు కూడా.
- C ని, D ని ఒక దానిమీద ఒకటి వచ్చేలా మడుచుకోండి. చివరగా అడుగు భాగాన్ని మడిచి పేపర్ క్లిప్ వేయండి. పేపర్ హెలికాప్టర్ రెడీ అయిపోయింది.
- దాన్ని పేపర్ క్లిప్‌తో పట్టుకుని మీకు సాధ్యమైనంత ఎత్తుకు విసరండి. అది కిందికి పడేప్పుడు గిరగిర తిరుగుతంది.

కాన్సెప్ట్: రెండు బ్లేడ్లూ ఒకే విధమైన పుష్‌ను, పరస్పర విరుద్ధమైన దిశలలో ఎదుర్కోవడం వల్ల పేపర్ హెలికాప్టర్ పడేప్పుడు చుట్టూ గిరగిర తిరుగుతుంది. పరస్పర విరుద్ధమైన ఒత్తిడులు ఒక్కసారిగా పనిచేయడం వల్ల హెలికాప్టర్‌ను గిరగిర తిరిగేలా చేస్తాయి.

**మీ మనసులోని మాట చెప్పండి!**

మీ పత్రికలో ప్రాంతాలవారీగా కథలు కావాలా?

a) అవును b) వద్దు

మీ సమాధానాన్ని RYC <space> <a\b>54646కు SMS చెయ్యండి.

ఆగస్ట్'09 ఫలితాలు: a: 43%; b: 57%;

# చందమామ లోకజ్ఞానం క్విజ్-9

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే:

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్-9 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. అక్టోబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి.
6. డిసెంబర్ నెల సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## మన పండుగలు




1. 'ఉపవాసం ముగించే పండుగ'గా దేనిని చెబుతారు?
2. పార్సీ నూతన సంవత్సరాన్ని ఏమని పిలుస్తారు?
3. కేరళ రాష్ట్ర ప్రజలందరూ జరుపుకునే ముఖ్యమైన పండుగ ఏది?
4. కాంచన్ జంగా శిఖర పరిరక్షణ జ్ఞాపకార్థంగా జరుపుకునే పండుగ ఏది?
5. ఏ పండుగ సందర్భంగా మనదేశంలో అతిపెద్ద పశువుల సంత జరుగుతుంది?
6. సుదీర్ఘమైన వైవాహిక జీవితం కోసం ఉత్తర భారత దేశ గృహిణులు నోచే నోముల పండుగ ఏది?

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు
ఒక్కమాటలోగాని,
చిన్న వాక్యంలోగాని
వ్యాఖ్యలు
రాయగలరా?
రెండు వ్యాఖ్యలకూ
సంబంధం
ఉండాలి.



S. BALASUBRAMANIAN



S. BALASUBRAMANIAN



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.
పోటీ ఫలితాలు డిసెంబర్ 2009 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100/- బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ ఇండియా లిమిటెడ్,
**2/513, సందీప్ అవెన్యూ ఈస్ట్, సెకండ్ మెయిన్ రోడ్, చిన్న నీలాంగరై, చెన్నయ్ - 600 041**

## అభినందనలు

ఎం. బాలాజీ సింగ్,
ఇంటి నం. 8-3-228/642,
రహమత్ నగర్,
యూసుఫ్‌గూడ,
హైదరాబాద్-500 045.

ఫోటో వ్యాఖ్యల పోటీ:





సంగీతంలో సప్తస్వరాలు పలికిస్తాం!
నటనలో నవరసాలొలికిస్తాం!!

## చందమామ లోకజ్ఞానం క్విజ్-7 ఆగస్ట్ 2009 సమాధానాలు

1. పిల్లులను దయ్యాలుగా అనుమానించి ప్రజలు వాటినన్నిటినీ పట్టి బంధించి కాల్చేశారు. దాంతో రోగగ్రస్తమైన ఎలుకలు విపరీతంగా పెరిగిపోయి బ్లాక్ ప్లేగు వ్యాధిని వ్యాపింపజేశాయి. 2. ఆస్ట్రేలియా 3. ప్రపంచ కోళ్ళ రాజధాని జార్జియాలోని గైనెస్ విల్లే 4. కోళ్ళంటే భయం 5. అంటార్కిటికా 6. కరీబియన్ 7. పోమిరేనియన్, సెకిన్‌జీస్.

*గమనిక: సరైన సమాధానాలు గల ఎంట్రీలు రాలేదు గనక బహుమతులు ఇవ్వలేకపోతున్నాము.*

# ముందుచూపు

తండ్రి రంగయ్య పంచి ఇచ్చిన ఆస్తి పెట్టుబడిగా రామయ్య, సోమయ్యలు విడివిడిగా వ్యాపారాలు ప్రారంభించారు. ఇద్దరూ వ్యాపారంలో సమర్థులే. అయినప్పటికీ సోమయ్య వ్యాపారం ఎలాంటి ఒడుదుడుకులూ లేకుండా దినదినాభివృద్ధి చెందింది. రామయ్యకు అనుకోని నష్టాలు ఎదురై చితికిపోయాడు. ఇతరుల వద్ద ఏదైనా ఉద్యోగం చేసి కుటుంబ శకటాన్ని లాగాలని నిర్ణయించాడు.

సంగతి తెలిసి సోమయ్య అన్నను కలుసుకుని, ''ఎవరి దగ్గరో ఉద్యోగం ఎందుకు? నాతోనే కలిసి వ్యాపారం చేయొచ్చుకదా? నీకు కావలసిన జీతం నేనే ఇస్తాను. నీ అనుభవం మన వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతుంది,'' అన్నాడు. అయితే, రామయ్య అందుకు ఒప్పుకోకుండా దూరపు బంధువు వద్ద చిన్న ఉద్యోగంలో చేరాడు.

ఆ రోజు రాత్రి భార్య పక్క వేస్తూ రామయ్య నిర్ణయానికి గల కారణం అడిగింది.

''తమ్ముడు పెద్ద ఉద్యోగం, ఎక్కువ జీతం ఇచ్చినా నాకన్నా చిన్నవాడు గనక, ఏదైనా ఎప్పుడైనా మాట అంటే బాధగా ఉంటుంది. అదే దూరపు బంధువు పెద్దవాడు గనక ఏమైనా అన్నా అంతగా బాధ ఉండదు. వయసు పైబడింది కాబట్టి ఆయనకు నా సాయం అవసరం ఎక్కువ. అందువల్ల గౌరవంగా చూసే అవకాశం ఉంది. నాకు ఎదుటి వారికి సాయపడుతున్నానన్న తృప్తీ ఉంటుంది. అందుకే జీతం తక్కువయినప్పటికీ ఆయన వద్ద పనిలో చేరాను,'' అన్నాడు.

భర్త ముందుచూపునూ, అనుభవ జ్ఞానాన్నీ భార్య మనసులో మెచ్చుకున్నది.

–ఆకెళ్ళ వెంకటసుబ్బలక్ష్మి



# Avail the Coolest Combo Pack!!




## Buy Chandamama's Collector's Edition+Ramayana for Rs ~~898~~ 673* Only!



Chandamama's Ramayana is the first fully illustrated Ramayana which comes in a single book.



Chandamama Collector's Edition features the best of Chandamama published over the last 60 years.

I want the Coolest Combo Pack:

Name.................................................... Subscriber No ....................................

Address....................................................................................................

City .................................... State .................................... Pin ....................................

Telephone .................................... Mobile .................................... Email ....................................

Enclosed Cheque/DD for Rupees (in words) ....................................................................

Cheque/DD no .................................... Favouring Chandamama India Ltd

on .................................................................... bank. *(Send At-Par cheques or add Rs 60 for non-Chennai cheques)*

Please mail the order form to :

Chandamama India Limited, No. 2/513 (Old 3/396), Sundeep Avenue East, 2nd Main Road, Chinna Neelangarai, Chennai – 600 041. Phone: (044) 43992828

Email: chandamama@chandamama.com Web: www.chandamama.com

Both these titles are available only in English at all leading bookshops.

To place an order go to www.chandamama.com

*For purchase outside India, the Coolest Combo Pack is available at ~~$100~~ $80




**Chandamama is available in English and 12 regional languages. Junior Chandamama for children below 9 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama: -

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior

Name: ..........................................................................................

Date of Birth: ................................ Sex :....................................

Address: ......................................................................................

..................................................................................................

..................................................................................................

.................................................... City: ........................................

State:........................................ Pin:................................................

Telephone:....................................................................................

Mobile:..........................................................................................

Email:...........................................................................................

Subscription Number 9for renewals):...........................................

Gift Subscription to the following address:

..................................................................................................

..................................................................................................

..................................................................................................

..................................................................................................

Enclosed Cheque/DD* for Rupees................................................

Cheque/DD No ..............................................................................

favouring Chandamama India Ltd on.........................................

..............................................................................bank.

*Add Rs.60 for non-Chennai cheques. Your subscription will commence in 4 weeks.

Please mail the subscription form to:
**Chandamama India Limited,**
New 2/513 (Old 3/396) Sundeep Avenue East,
2nd Main Road, Chinna Neelankarai,
Chennai - 600041. Phone: (044) 43992828. Fax: (044) 43992829
Email: subscription@chandamama.com
You can also subscribe online at: www.chandamama.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 240 | Rs. 375 |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 190 | Rs. 300 |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| You Save | | Rs. 35 | Rs. 80 | Rs. 145 | Rs. 225 |

Annual Subscription Overseas : US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

# మారిన మనిషి



నందవరంలోని ప్రముఖవ్యాపారి సోమేంద్రుడు ఇంట్లో చండశాసనుడనీ, బయట పరమ పిసినారి అనీ పేరు తెచ్చుకున్నాడు. కట్టుబట్టలతో నందవరం చేరి, కష్టపడి దమ్మిడీ దమ్మిడీ కూడబెట్టి ఇవాళ లక్షాధికారిగా ఎదిగిన సోమేంద్రుడికి డబ్బు విలువ బాగా తెలుసు. సొంతానికి దమ్మిడీ ఖర్చుపెట్టాలన్నా మనసు విలవిలలాడిపోయేది. ఇక దాన ధర్మాలంటే ప్రాణం పోయినంత పనయ్యేది.

ఇద్దరు కొడుకులకూ పెళ్ళిళ్ళు చేసేశాడు. సోమేంద్రుడికి ఎందుకో ఇటీవల మనసు కాస్త వెలితిగా కనిపించసాగింది. ఏదో కోల్పోయినవాడిలా ఎప్పుడూ అసహనంగా ఉండేవాడు. దానిని గమనించిన భార్య మాలతి, ''ఎందుకలా దిగులుగా ఉన్నారు?'' అని అడిగింది.

''అదే నాకూ అర్థం కావడం లేదు. సరిగ్గా నిద్రపట్టడం లేదు. వయసు పెరుగుతున్నది కదా?'' అన్నాడు సోమేంద్రుడు.

''ఇప్పుడు మీకేమంత వయసు మరీను! ఇంకా జీవితంలో ఎన్ని చూడాలి? మీకు తెలియని అసంతృప్తి ఏదో మిమ్మల్ని పట్టి పీడిస్తున్నది. రామాలయంలో బసచేసిన మైత్రేయులను దర్శించి మీ సమస్యను తెలియజేయండి. ఆయన పరిష్కారంసూచించగలరు. ఆయన్ను గురించి అందరూ గొప్పగా చెప్పుకుంటున్నారు. కావాలంటే నేనూ మీతోపాటు వస్తాను,'' అన్నది భార్య.

''నువ్వెందుకుగాని, నేనే వెళ్ళి వస్తాను,'' అని చెప్పిన సోమేంద్రుడు ఆ రోజే రామాలయానికి వెళ్ళి ఏకాంతంలో సాధువును దర్శించి తన సమస్యను ఏకరువు పెట్టాడు.

అంతా విన్న మైత్రేయుడు, ''నీ ఆయువు మరో నలభై ఐదు రోజుల్లో ముగియనున్నది. రాబోయే అమావాస్యకు నీకు మరణగండం ఉన్నది,'' అన్నాడు.

ఆ మాట వినగానే పిడుగుపాటుకు గురైనవాడిలా, ''నిజంగానా స్వామీ?'' అన్నాడు



సోమేంద్రుడు. ''అవును. నిజంగానే!'' అన్నాడు మైత్రేయుడు.

''అయ్యో, నా బిడ్డలకు ఇంకా వ్యాపారంలో మెళకువలు అంతగా తెలియరాలేదే. పెద్దదిక్కు లేకపోతే వాళ్ళెలా బతగ్గలరు? ఇంకా కొన్నాళ్ళు బతికితే, వాళ్ళకు మరింత సంపాదించి పెట్టేవాణ్ణి కదా!'' అని వాపోయాడు సోమేంద్రుడు.

''పెళ్ళిళ్ళయిన కొడుకులు. ఎలా బతుకుతారో అన్న బెంగ ఇంకా నీకెందుకు? జీవితం అంటే భార్యాపిల్లలు మాత్రమే కాదు. వారికి అవతల పెద్ద సమాజం, మంచీ చెడ్డా అంటూ చాలా ఉన్నాయి. వాటిని గురించి కూడా కాస్త ఆలోచించు. అప్పుడే నీకు చివరి నలభై ఐదు రోజులయినా ప్రశాంతి లభిస్తుంది!'' అన్నాడు మైత్రేయుడు.

''అందుకు ఏం చేయమన్నారు? యజ్ఞయాగాలు, దేవుడికి ఉత్సవాలు చేయమన్నారా?'' అని అడిగాడు సోమేంద్రుడు.

''అవన్నీ అవసరం లేదు. సాయం అని వచ్చిన వారికి చేతనైన సాయం చెయ్. చాలు,'' అన్నాడు మైత్రేయుడు.

అక్కడి నుంచి ఇంటికి బయలుదేరిన సోమేంద్రుడు అమితమైన ఆందోళనకూ, తీవ్రమైన ఆలోచనకూ లోనయ్యాడు. ఇంటి గుమ్మంలోనే ఎదురుపడ్డ భార్య, ''సాధువు ఏం చెప్పారు?'' అని అడిగింది.

మౌనంగా ఇంట్లోకి వెళ్ళిన సోమేంద్రుడు, నీళ్ళు తాగాక, సాధువు చెప్పిన మాటలను భార్యకు చెప్పాడు.

''అయ్యో, మీరు లేకుండా నేనెలా జీవించగలను? నేనూ మీతోనే...'' అంటూ ఏడవసాగింది భార్య.

''మాలతీ! దుఃఖించకు. పుట్టిన ప్రతి ఒక్కరూ ఏదో ఒక రోజున వెళ్ళిపోవలసిందే కదా? నేను చనిపోయాక, నువ్వూ లేకుండాపోతే, మన కుటుంబం పరిస్థితి ఏమవుతుందో ఆలోచించు. కొడుకులు, కోడళ్ళు ఇంకా చిన్నవాళ్ళు. మనవలను పెంచి పెద్ద చేయవలసిన బాధ్యత నీదే,'' అన్నాడు సోమేంద్రుడు కళ్ళు తుడుచుకుంటూ.

ఇంతలో పాలేరు వెంకన్న వచ్చి, ''అయ్యా, వట్టిపోయిన ఆవును కబేళాకు తోలుకు వెళుతున్నాను,'' అన్నాడు.

సోమేంద్రుడు కంగారు పడుతూ, ''వద్దు వద్దు,'' అన్నాడు.

“తోలుకు వెళ్ళమని నిన్న తమరే చెప్పారు కదయ్యా,” అన్నాడు వెంకన్న.

“నిన్న చెప్పాను. ఇప్పుడు వద్దంటున్నాను. ఈ ఆవుకు కూడా పాడి పశువులకు లాగే మామూలు మేత వేసి కుడితి పెడుతూ ఉండు,” అన్నాడు.

వెంకన్న యజమాని వైపు ఆశ్చర్యంగా చూసి, “అలాగేనయ్యా,” అని వెళ్ళిపోయాడు.

మరి కొంతసేపటికి పెద్దకొడుకు ఫణీంద్రుడు అక్కడికి వచ్చి భయం భయంగా నిలబడ్డాడు. “ఏమిటి?” అన్నట్టు చూశాడు సోమేంద్రుడు.

“సంక్రాంతి పండుగ దగ్గర పడుతున్నది కదా? మీ కోడళ్ళు, మనవళ్ళు కొత్త బట్టలు కొనాలంటున్నారు,” అన్నాడు ఫణీంద్రుడు.

“దానిదేముంది? రేపే వెళ్ళి కొనుక్కుందాం. నేనూ వస్తాను,” అన్నాడు సోమేంద్రుడు.

కొడుకు ఆశ్చర్యంగా తండ్రికేసి చూశాడు. మామూలుగా పండుగలకు బట్టలు కొనాలంటే తండ్రికి ఇష్టం ఉండేది కాదు. బట్టలు అవసరం ఉంటేనే కొనాలి గాని, పండుగలూ, పబ్బాలూ అంటూ బట్టలకు డబ్బు తగలవేయకూడదని పాఠాలు వల్లించేవాడు. అలాంటి తండ్రిలో ఇప్పుడు వచ్చిన మార్పుకు కారణం తెలియక కొడుకు విస్తుపోయాడు.

మరునాడు సోమేంద్రుడు భార్య, కొడుకులు, కోడళ్ళను తీసుకువెళ్ళి ఎవరికి నచ్చిన దుస్తులు వాళ్ళకు కొనిపెట్టాడు. వాళ్ళంతా సంతోషిస్తూంటే దానిని చూసిన సోమేంద్రుడికి సంతోషం, తృప్తి కలిగాయి. ఆ రాత్రి హాయిగా నిద్రపోయాడు.



మూడోరోజు పురోహితుడు జానకీరామశాస్త్రి వచ్చి, విచారవదనంతో, “అయ్యా, నా ఒక్కగానొక్క కూతురి పెళ్ళికుదిరింది. మంచి సంబంధం. అదేమో, ఎంత ప్రయత్నించినా ఎక్కడా అప్పు పుట్టలేదు. వెయ్యి రూపాయలు అప్పుగా ఇచ్చారంటే, కొద్ది కొద్దిగా తీర్చేస్తాను. మీ మేలు మరవను,” అన్నాడు.

“మా ఇద్దరి పిల్లలకు మీరే పెళ్ళి చేశారు. మీ ఇంట్లో శుభకార్యానికి ఆ మాత్రం సాయం చేయలేనా! అయినా వెయ్యి రూపాయలతో పెళ్ళెలా చేస్తారు?” అంటూ లోపలికి వెళ్ళి రెండు వేలు తెచ్చిచ్చాడు.

రామశాస్త్రి నివ్వెరపోయి, “అయ్యా, నేను అంత డబ్బు ఎలా తిరిగి చెల్లించగలను? నాకు వెయ్యి రూపాయలు చాలు,” అంటూ తిప్పి ఇవ్వబోయాడు.

‘‘భలేవారే! ఈ సొమ్ము నేను అప్పుగా ఇవ్వడం లేదు. మీ అమ్మాయికి కానుకగా ఇస్తున్నాను. మీరు తిరిగి చెల్లించనవసరం లేదు,’’ అన్నాడు సోమేంద్రుడు.

‘‘అయ్యా, తమరు సాక్షాత్తు ఆ భగవంతుడిలా కనిపిస్తున్నారు,’’ అంటూ ఆనందపడిపోయాడు రామశాస్త్రి.

‘‘దయచేసి నన్ను దేవుడితో పోల్చకండి! నేను కేవలం మానవమాత్రుణ్ణి,’’ అన్నాడు సోమేంద్రుడు.

భర్తలో వచ్చిన మార్పును చూసి మాలతి చాలా సంతోషించింది. అయినా మైత్రేయుడి హెచ్చరిక గుర్తు రావడంతో ఆమె గుండె బరువెక్కసాగింది.

‘‘సాటి వారికి సాయపడడంలో ఇంత తృప్తి ఉందని నాకిన్నాళ్ళు తెలియకపోయింది,’’ అనుకున్నాడు సోమేంద్రుడు.

ఆ తరవాత కూడా అడిగిన వారికి లేదనకుండా సాయపడుతూ, దానధర్మాలు చేస్తూ వచ్చాడు. నలభైరోజులు గడిచిపోయాయి. మైత్రేయుడు చెప్పిన అమావాస్య రానే వచ్చింది. ఉదయం నుంచే మౌనంగా భగవధ్యానంలో గడపసాగాడు.

రాత్రయింది. అమావాస్య రాత్రి గడిచిపోయింది. తెల్లవారగానే సోమేంద్రుడు, మైత్రేయుడి వద్దకు వెళ్ళాడు. అప్పుడే దాపులనున్న నదిలో స్నానం ముగించి, సంధ్యావార్చి తిరిగి వస్తున్నాడాయన. సోమేంద్రుడు ఆయన పాదాలకు నమస్కరించాడు. ‘‘సోమేంద్రా, మరణభయంతో పుణ్యకార్యాలు చేసి, నీ ఆయుష్షును పొడిగించుకున్నావు. శేష జీవితాన్ని కూడా ఇలాగే సాగించు. ధనార్జన చేసేప్పుడు మరణమే లేదన్న విధంగా కష్టపడి సంపాదించాలి. పుణ్యకార్యాలు చేసేప్పుడు రేపే మరణం అన్నట్టు చేయాలి. దేవుడు మనకు సంపదలనిచ్చేదే దానిని పదిమందికీ ఉపయోగించాలనే! ఈ సత్యాన్ని గ్రహించి పదిమందికి సాయపడుతూ, చిరకాలం హాయిగా జీవించు,’’ అని ఆశీర్వదించాడు.

సోమేంద్రుడు కృతజ్ఞతతో మునికి నమస్కరించి, పరమానందంతో ఇంటికేసి బయలుదేరాడు.

–వాణిశ్రీ



# అమ్మవారి వరం!



భద్రగిరి గ్రామంలో ఇరుగుపొరుగు ఇళ్ళల్లో నివసించే రామయ్య, శివయ్య బాల్యం నుంచే కలిసిమెలిసి మంచి స్నేహంతో ఉండేవారు. యుక్తవయస్కులైన ఇద్దరికీ ఒకే సంవత్సరం పెళ్ళయింది. రామయ్య భార్య సరస్వతి, శివయ్య భార్య సుభద్ర కూడా ఎంతో అన్యోన్యంగా ఉండేవారు. మరో రెండేళ్ళు తిరిగే సరికి రామయ్యకు ఒక కూతురూ, శివయ్యకు ఒక కొడుకూ పుట్టారు. చూస్తూండగానే రమ, నారాయణ అనే వాళ్ళిద్దరూ పెరిగి పెద్దవాళ్ళయ్యారు.

రామయ్య కొద్దిగా చదువుకున్నవాడు. అందువల్ల గ్రామంలోని పిల్లలను చేరదీసి తమ ఇంటికి ఎదురుగా ఉన్న వేపచెట్టుకింద వీధిబడి పెట్టాడు. అతడి శిక్షణలో తమ పిల్లలు బుద్ధిమంతులై చదువుపట్ల శ్రద్ధ కనబరుస్తున్నారని గ్రామస్థులు గ్రహించారు. రామయ్యకు తమ చేతనైన సాయం చేసేవారు. వాళ్ళిచ్చేదానితోనే రామయ్య కుటుంబం గడుస్తోంది. ఇక శివయ్యకు తాత తండ్రుల నుంచి సంక్రమించిన పొలం కొద్దిగా ఉందన్న మాటేగాని, ఆలూమగలు రేయనక పగలనక కష్టపడినా ఫలసాయం మాత్రం అంతంత మాత్రంగానే ఉండేది.

శివయ్యకు వంశపారం పర్యంగా చేస్తూన్న వైద్యం తెలుసు. దాపులనున్న అడవికి వెళ్ళి మూలికలు సేకరించుకుని వచ్చి మందులు, గుళికలు తయారు చేసి చిన్నచిన్న జబ్బులకు వైద్యం చేసేవాడు. అతనికి హస్తవాసి కలవాడనే పేరున్నది. ఉన్నవాళ్ళు ఎంతో కొంత ముట్టచెప్పేవారు. లేని వారిని అసలు అడిగేవాడు కాదు.

మిత్రులిద్దరూ అప్పుడప్పుడు చెరువు కట్ట వద్ద కలుసుకుని కష్టసుఖాలను చెప్పుకునేవారు. అలా ఒకనాడు మాట్లాడుకుంటూండగా రామయ్య, ''నీ కేం బుద్ధిమంతుడైన



గాలివానకు కూలిపోయిన ఎండు రావిచెట్టు కనిపించింది. ఆమె దగ్గరికి వెళ్ళి చూస్తే, చెట్టు బోదెలో పూడుకు పోయి కొద్దిగా పైకి కని పిస్తూన్న అమ్మవారి విగ్రహం కనిపించింది. ఆమె మట్టిని తొలగించి, విగ్రహాన్ని కడిగి, అడవి పూలతో అలంకరించి చేతులెత్తి మొక్కుతూ, ''అమ్మా, నువ్వు ఇక్కడున్న సంగతి ఇన్నాళ్ళు తెలియకపోయింది. అడవికి వచ్చినప్పుడల్లా నీకు పూజ చేస్తాను. అందరినీ చల్లగా చూడుతల్లీ,'' అని ప్రార్థించి ఇంటి ముఖం పట్టింది.

ఆ రోజంతా సుభద్ర కళ్ళముందు కళ కళలాడుతూన్న అమ్మవారి విగ్రహమే కనిపిం చసాగింది. రాత్రి అమ్మవారిని తలుచుకునే నిద్రపోయింది. తెల్లవారుజామున ఆమె కలలో అమ్మవారు కనిపించి, ''సుభద్రా! ఎన్నో ఏళ్ళుగా పూజాపునస్కారాలు లేని నన్ను, నీ పూజ సంతోషపరిచింది. నీకు రెండు వరాలి స్తాను. కోరుకో,'' అన్నది.

''తల్లీ, నీకు తెలియనిదేమున్నది? మా పక్కింటి సరస్వతి కూతురు కారునలుపు. ఆమెకు మంచి రంగు, రూపం ఇచ్చి వివాహం జరగాలని ఆశీర్వదించు,'' అన్నది సుభద్ర.

''మరి నీకేం కావాలో కోరుకో,'' అన్నది అమ్మవారు. ''మాకు నీ అనుగ్రహం చాలు, తల్లీ!'' అన్నది సుభద్ర.

''సరే, అడవిలో నా విగ్రహానికి ఉత్తర దిశగా పసుపు పూలు పూసిన మిన్నేటి పొన్న గంటి పాలతీగ కనిపిస్తుంది. ఆ తీగవేరును అరగదీసి పాలలో కలిపి రమకు ఐదు రోజులు

కొడుకును కన్నావు. పైగా వైద్యం నేర్చుకోమని పట్నం పంపేశావు. నేను ఆడపిల్ల తండ్రిని. నా బిడ్డ రమ బంగారుతల్లేగాని దేవుడెందుకో ఆమెను నల్లగా పుట్టించాడు. ఎంత ప్రయ త్నించినా పెళ్ళి సంబంధం కుదురడం లేదు,'' అన్నాడు బాధగా.

''బాధపడకు రామయ్యా. రమకని ఒకడు పుట్టే ఉంటాడు. నీ మంచి మనసుకు అంతా మంచే జరుగుతుంది,'' అని ధైర్యం చెప్పాడు శివయ్య.

మరునాడు గ్రామాధికారి మెట్ల పైనుంచి జారిపడ్డాడని కబురు వస్తే, శివయ్య ఆయ నకు వైద్యం చేయడానికి వెళ్ళాడు. సుభద్ర మూలికలు సేకరించడానికి ఒంటరిగా అడవికి బయలుదేరింది. అడవిలో కొంతసేపు మూలి కలు సేకరించిన ఆమెకు, నిన్నరాత్రి కురిసిన

తాగించు. నీ కోరిక నెరవేరుతుంది,'' అని చెప్పి అంతర్ధానమయింది అమ్మవారు.

ఉలిక్కిపడి లేచిన సుభద్ర అమ్మవారికి మొక్కుకుని, కల గురించి భర్తకు చెప్పింది. ఇద్దరూ కలిసి అడవికి వెళ్ళి అమ్మవారు చెప్పిన వేరును తెచ్చి అరగదీసి పాలలో కలిపి రామయ్య కూతురు రమకు తాగమని ఇచ్చారు. ఆ విధంగా ఐదు రోజులు ఇచ్చేసరికి రమ కారునలుపు రంగు మెల్లమెల్లగా తగ్గి ఆరో రోజుకు పసుపుపచ్చ రంగు వచ్చింది. రమ ఆకర్షణీయమైన ముఖవర్చస్సుతో అందమైన యువతిగా మారిపోయింది. ఆమె తల్లిదండ్రుల ఆనందానికి ఎల్లలు లేకుండా పోయింది. సరస్వతి ఆనందబాష్పాలతో కృతజ్ఞతాపూర్వకంగా సుభద్ర చేతులు పట్టుకున్నది. ''అంతా అమ్మవారి దయ,'' అన్నది సుభద్ర.

రమ అందగత్తెగా మారిన విషయం తెలియగానే పలువురు యువకులు ఆమెను పెళ్ళాడడానికి పోటీ పడసాగారు. దాపులనున్న పట్టణంలో పేరుమోసిన వ్యాపారి ధనగుప్తుడు ఆమెకు వెయ్యి వరహాలు ఎదురిచ్చి కోడలుగా చేసుకుంటానని కబురు పంపాడు. రామయ్య ఆలోచనలో పడ్డాడు. ఆ సంగతి గ్రహించిన రమ, ''నన్ను చేసుకోవడానికి పట్నంలో ఉన్న నారాయణ ఇష్టపడతాడేమో అడుగు,'' అన్నది.

రామయ్య ముఖం చిట్లించి, ''వెయ్యి వరహాలు, మాటలా?'' అన్నాడు.

''నాకు ఈ రూపం రావడానికి కారణం సుభద్ర అత్తయ్య. డబ్బుకు ఆశపడి ఆ సంగతి మరిచిపోకూడదు కదా?'' అన్నది రమ. ఆ మాటతో గతుక్కుమన్న రామయ్య, ''కన్నబిడ్డవైనా, నా కళ్ళు తెరిపించావు తల్లీ,'' అంటూ రమ తలనిమిరాడు ఆప్యాయంగా.

నారాయణ సమ్మతించడంతో, తల్లిదండ్రులు పరమానందం చెందారు. మరుసటి ముహూర్తంలోనే రాములవారి గుడిలో నారాయణ-రమల పెళ్ళి నిరాడంబరంగా జరిగింది. మరి కొన్నాళ్ళకు గ్రామంలో చిన్న వైద్యశాల, పాఠశాల ఏర్పాటు చేసుకుని నారాయణ, రమ కలిసి నడపసాగారు. తమ పిల్లలు వృద్ధిలోకి రావటం చూసి మిత్రులిద్దరూ ఆనందిస్తూ అంతా అమ్మవారి వర ప్రభావం అనుకుంటూ శేష జీవితాన్ని హాయిగా గడిపారు. -లక్ష్మీశిల్ప



# సంప్రదాయేతర విధానాలు

*క్రీ.శ. 1338, శిశిర ఋతువు, హిమాలయ పాదతలంలోని ఖురాచల్ ప్రాంతం. పర్వత నగరం వరంగల్‌కు వెళ్ళేబాట.*

కొండమార్గం చాలా ఇరుగ్గా ఉంది. బరువైన ఉడుపులు ధరించిన ఒక సైనికుడు గుర్రం మీద వెళుతూ జాగ్రత్తగా ముందుకు నడుపుతున్నాడు. అయితే కొండమార్గంలో ఒత్తుగా పరుచుకున్న చిన్నచిన్న గుండ్రాళ్ళు జారుతూం డడం వల్ల, పట్టు దొరక్క ముందుకు వెళ్ళడానికి యమయాతన పడుతున్నాడు. దానికితోడు చలి, ఈదురుగాలులు, వర్షం అతణ్ణిముందుకు వెళ్ళనీయకుండా అడ్డుకుంటున్నాయి.

''ముందుకు ఒక్క అడుగు వేయలేక అలాగే నిలబడిపోయాడు చూశావా?'' అన్న హేళనా స్వరం మెల్లగా వినిపించింది. చెట్టు కొమ్మపై కూర్చున్న భోలానాథ్ గుబురుగా ఆకులున్న రెమ్మలను పక్కలకు తోసికళ్ళమీద జారుతూన్న వర్షపునీటి ని తుడుచుకుంటూ, మిత్రుడి మాటలు వింటూ కిందికి చూశాడు. సైనికుడు ఒక్కొక్క అడుగు ముందుకు సాగడానికి ఎంతో శ్రమపడడం కనిపించింది.

భోలానాథ్, అతడి స్నేహితుడు గంగా పర్వత సౌందర్యానికి ప్రసిద్ధిగాంచిన ఖురాచల్ భూమి పుత్రులు. అద్భుతమైన ఆ కొండ చరియల అందచందాలు సుల్తాన్ మహమ్మద్ బీన్ తుగ్లక్ జ్ఞాపకాలను ఏళ్ళ తరబడి వెంటాడాయి. ఆ ప్రాంతాలను పూర్తిగా ఆక్రమించుకోవడానికి అతణ్ణి పురికొల్పాయి.



''తిరుగుబాటుదారుల పట్ల తుగ్లక్‌కు ఉన్న పగ, ద్వేషం గురించి మన తండ్రులు చెప్పిన విషయాలు గుర్తున్నాయి కదా!'' అని చెప్పి కొంతసేపు ఆగిన గంగా, ''సొంత మేనల్లుడైన గుర్షాస్పను అతడేం చేశాడో తెలుసా?'' అని అడిగాడు.

''తనకు ఎదురు తిరిగాడని అతణ్ణి ముక్కలు ముక్కలుగా నరికి మాంసాన్ని వండి, చర్మంలో గడ్డిని కుక్కాడు! అదే కదా నువ్వడిగేది?'' అని సమాధానం ఇచ్చాడు భోలానాథ్.

తిరుగుబాటుదార్లు అనుభవించిన భయంకరమైన బాధల గురించి ఖురా



చల్ ప్రజలు కథలు కథలుగా చెప్పు కుంటారు.

''అతడి శత్రువులకు ఆశ్రయమిస్తున్నాం గనక, ఖురాచల్‌ను వశపరచుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. ఒక సుల్తానుగా అతడి స్పందన, నిర్ణయం సరైనవే అని భావిస్తున్నాను,'' అన్నాడు భోలానాథ్.

గంగాముఖం ఎరుపెక్కింది. ''నువ్వు అసలు ఎవరి పక్షం వహిస్తున్నావు?'' అని అడిగాడు.

''పరిస్థితులను బట్టి అన్ని పక్షాలనూ పరిశీలించవలసిన అవసరం ఉంది కదా?'' అన్నాడు భోలానాథ్.

''చాలుచాలు. జిద్వామీద దురాక్రమణ జరపబోమనే కదా వాళ్ళు మొదట చెప్పారు?'' అని అడిగాడు గంగా.

''జిద్వా దాదాపు మైదాన ప్రదేశంలో ఉంది-దాన్ని ఆక్రమించడం వాళ్ళకు అంతకష్టం కాదు.''

''ఆ తరవాత సుల్తాన్ పరిసర ప్రాంతాలన్నిటినీ ఆక్రమించుకుని పొగబెట్టి చెదపురుగులను తరిమినట్టు మన ప్రజలను తరిమేశాడు. వాళ్ళిప్పుడు వరంగల్‌ను సైతం పట్టుకున్నారు. నువ్వేమో ఉన్నది ఇదొక్క ఇరుకు మార్గమే తప్ప దాన్ని సమీపించజాలరని చెప్పావు...''

''అలా అనే మా నాన్న నాకు చెప్పాడు,'' అన్నాడు భోలానాథ్ పెదవులు బిగించి.

''మీ తండ్రి చాలా మంచి నాయకుడే భోలా. అయినా, ఆయన కూడా తప్పులు చేయవచ్చు కదా!''

''అవును. ఆ తప్పును సరిదిద్దడమే ఇప్పటి మన తక్షణ కర్తవ్యం. గంగా!''

''అద్భుతం! చక్కగా చెప్పావు మరి. దాన్ని ఎలా సరిదిద్దాలనుకుంటున్నావు?'' అని అడిగాడు గంగా తన బాల్యమిత్రుణ్ణి కాస్త వెటకారంగా.

''మనం చెదపురుగులం! ఆ సంగతి మరిచిపోయావా?''

***

*క్రీ.శ. 1338, ఋతుపవనాల ప్రారంభసమయం, వరంగల్ పర్వతనగరం, సుల్తాన్ మహమ్మద్ బీన్ తుగ్లక్ సైనిక స్థావరం-కమాండ్ పోస్ట్.*

విశ్వాస పాత్రుడైన సేవకుడు జనరల్ ఆదమ్ ఖాన్, సుప్రసిద్ధ సుల్తాన్ మహమ్మద్ బీన్ తుగ్లక్‌కు పంపిన లేఖ సారాంశం:

''.... వరంగల్‌లో ఉన్న సైనికులలో వ్యాపిస్తున్న జ్వరాన్ని నిలువరించలేక పోతున్నాం. నాకు తెలిసినంత వరకు ఇదంతా తాను జ్వరంతో ఉన్నప్పటికీ శిబిరంలో జొరబడి ఆహారపదార్థాలు సరఫరా చేసిన మూర్ఖుడైన ఒక గిరిజ

నుడి మూలంగానే జరిగింది. ప్రభువుల సైనిక బలం అజేయమైనది. ఈ అంతఃశత్రువును రూపుమాపగలనని వ్యక్తిగతంగా భరోసా ఇస్తున్నాను. జ్వరాన్ని నయం చేయడానికి గిరిజనుల వద్ద తప్పకుండా ఔషధాలు ఉండి తీరుతాయి.''

మహాశక్తి సంపన్నుడైన సుల్తాన్ మహమ్మద్ బిన్ తుగ్లక్ నుంచి జనరల్ ఆదమ్‌ఖాన్‌కు అందిన సమాధానం సారాంశం:

''.... అక్కడి గిరిజనుల సహకార నిరాకరణ కారణంగా ఒక నెలగా నువ్వు జ్వరాన్ని అరికట్టలేకపోయావు గనక, వెంటనే ఢిల్లీకి తిరిగి రావాలని ఆజ్ఞాపిస్తున్నాను. ఇందుమూలంగా వాళ్ళల్లో క్రమ పద్ధతి కరువయిందని తెలుస్తోంది. అందువల్ల జిద్వా పరిసర ప్రాంతాలకు తిరిగి వచ్చి, ఖురాచల్‌ను పట్టుకోవడానికి సరైన పథకం చేపట్టడం మంచిది. సుల్తాన్ సైనికులను ఓడించడానికి పూనుకునే సాహసం స్థానిక శక్తులకు లేదనుకుంటాను!



* * *

ఋతుపవనాల సమయం, క్రీ.శ. 1338 జిద్వా నగరానికి వెళ్ళే మార్గం.

వర్షపునీటితో తడుస్తున్న బండల మధ్యగా వరుసగా సైనికులు కొండపై నుంచి కిందికి దిగసాగారు. దరిదాపుల్లోని గిరిజనులను తుద ముట్టించిన తుగ్లక్ సైనికులు శిబిరాలను ఎత్తివేసి జిద్వాకేసి తిరిగి వస్తున్నారు.

సేనాధిపతి ఆదమ్‌ఖాన్ మౌనగంభీరంగా నిలబడి ఉన్న చెట్ల సందుల్లోంచి చూడసాగాడు. సైనికులు కిందికి దిగడం ప్రారంభించినప్పటి నుంచి అతడిలోని యుద్ధ స్పృహ మేల్కొన్నది. ప్రశాంతంగా ఉన్నప్పటికీ సైనికులు ఎంతో అప్రమత్తతతో నడుస్తున్నారు.

నిశ్శబ్దానికి అలవాటుపడని ఒక సైనికుడు పాడడం ప్రారంభించాడు గాని, వెంటనే అడ్డుకోబడ్డాడు. గుర్రాలపై సైనికులు దారిగుండా వెళుతున్నారు. ఆదమ్‌ఖాన్ ఇరువైపులా పెరిగి ఉన్న బ్రహ్మాండమైన వృక్షాలకేసి చూడసాగాడు. తలకు తగిలేలా ఉన్న వాటి గుబురు కొమ్మలు కొన్ని నేలను తాకుతున్నంతగా కిందికి వాలిపోయి ఉన్నాయి. ఒక్కొక్క కొమ్మ పడితే పది మందిని నుగ్గునుగ్గు చేసేంత పెద్దదిగా కనిపించింది. అతడిలో ఆ ఆలోచన మెదులుతున్నప్పుడే ఒక బ్రహ్మాండమైన వృక్షం, వరుసలో ముందుగా ఉన్న సైనికుల మీదికి ఫెళ ఫెళ మంటూ విరుచుకుపడింది.

ఆదమ్‌ఖాన్ యుద్ధ స్పృహ ఏం జరుగుతున్నదో గ్రహించింది కాని, తన మనుషులను

హెచ్చరించి ఆయత్తపరిచేలోగానే ఎదురు దాడి అంతమైపోయింది.

* * *

రెండు *గంటల* తరవాత, జిద్వాకు వెళ్ళే మార్గం పూర్తిగా మూసుకుపోయింది.

కొండమార్గమంతా రక్తసిక్తమయింది. తుగ్లక్ సైనికులు బ్రహ్మాండమైన చెట్లకింద పడి నుగ్గునుగ్గయ్యారు. కొందరు గుర్రాల కింద పడిపోయారు. మరికొందరు నెత్తురు గాయాలతో పక్కలకు దొర్లిపోయారు. ఇదంతా క్షణాల్లో జరిగిపోయింది.

''విజయం! విజయం!! అడివి తల్లి మనలందరినీ ఇలా కాపాడగలదని ఎవరికి తెలుసు?'' అంటూ ఆనందాతిరేకంతో గంగా గెంతులు వేయసాగాడు.

''ఇది యుద్ధం కాదు–ఊచకోత!'' అన్నాడు భోలానాథ్ గంభీర కంఠస్వరంతో.

గంగా మిత్రుడి భుజం మీద చేయి వేసి, ''మరో మార్గం ఏదైనా ఉండి ఉన్నట్టయితే, మనం దాన్ని అనుసరించి ఉండేవాళ్ళమే కదా!'' అన్నాడు.

''ఇది ఇంకా పూర్తి కాలేదు. వ్యవసాయం చేసుకోవడానికి మనకు కొండ పాదతలంలోని భూములు కావాలి. అందుకు తుగ్లక్ సుతరామూ అంగీకరించడు,'' అని హెచ్చరించాడు భోలానాథ్.

''మనం వ్యవసాయం చేసుకోడానికి వీలు కల్పించేలా మీ తండ్రి ఇప్పటికే ఒప్పందం కుదుర్చుకున్నాడు కదా!'' అని హుంకరించిన గంగా, ''మనం స్వతంత్రానికి విలువనిచ్చి ప్రాణాలొడ్డగలమని తుగ్లక్‌కు తెలిసిరావాలి.



ఖురాచల్‌తో పెట్టుకోకూడదని తుగ్లక్‌కు ఈ చిన్న సాహసం ద్వారా అవగతమై ఉంటుంది,'' అని ఆగాడు. ఆ తరవాత, ''నువ్వు రూపొందించిన ఈ పథకం మనలో మనపట్ల విశ్వాసం కలిగించింది. నీ పథకాలే మనలనూ, మన కొండలనూ కాపాడాయి,'' అన్నాడు.

భోలానాథ్ మందహాసం చేస్తూ, ''మనం కొండ మనుషులమే. అయినా మనం మొదట సైనికులం. తుగ్లక్ మనల్ని తక్కువగా అంచనా వేసి ఉండకూడదు,'' అన్నాడు.

''అవును. అది సరేగాని, నీకు జ్వరంగా ఉన్నప్పుడే ఆదమ్‌ఖాన్ స్థావరానికి వెళ్ళి అక్కడి వాళ్ళకందరికీ ఒక్కసారిగా జ్వరం అంటించాలనే ఆలోచన నీకెలా వచ్చింది భోలా? ''అని అడిగాడు గంగా.

''మనం చెదపురుగులం కదా! అంతలోనే మరిచిపోతేఎలా?'' అంటూ నవ్వాడు భోలానాథ్.

మళ్ళీ వర్షపు ధారలు భూమిని తడపడం ప్రారంభించాయి. –పవిత్రాశ్రీనివాసన్

# కింగ్ ఖానా





## బిర్యాని వచ్చిన వైనం



పశ్చిమాసియాలోని సంచార జాతులు బియ్యం, మాంసం, మసాలాదినుసులు మట్టికుండల్లో నింపి, మట్టిలో పూడ్చి ఉడికించి ఆ తరవాత దాన్ని రుచికరమైన వంటకంగా వెలుపలికి తీసేవాళ్ళు! బిర్యాని ఆవిర్భావానికి సంబంధించిన అతి ప్రాచీనమైన ఆధారంగా దీనిని చెబుతారు.

****



‘బిరియన్’ అనే పర్షియన్ పదం నుంచే ‘బిర్యాని’ అనే మాట ఏర్పడింది. ‘బిరియన్’ అంటే ‘వండడానికి ముందు వేయించడం’ అని అర్థం. తైమూర్ లాంగ్ ఈ వంటకాన్ని 14 శతాబ్దంలో భారతదేశానికి తీసుకువచ్చినట్టు చెబుతారు.

****



ఒకసారి సైనిక శిబిరానికి వెళ్ళిన ముంతాజ్ మహల్ సైనికులు ఆహార లోపం వల్ల బక్కచిక్కి ఉండడం గమనించిందనీ, వాళ్ళ కోసం పరిపూర్ణమైన ఆహారంగా బిర్యాని తయారు చేయబడిందనీ చెబుతారు.

****



నిజామ్ నవాబులకు రాజభోజనంగా బిర్యాని ఉండేదే తప్ప, దీన్నెప్పుడుగాని అతిథులకు వడ్డించేవారు కాదు.

****



పంజాబ్ నవాబు బిర్యాని రకానికి మ్యాచ్ అయ్యే విధంగా రకరకాల రంగుల తలపాగాలు ధరించే వాడట. ఆయన వంటశాలలో దాదాపు 49 రకాల బిర్యానీలు తయారు చేసేవారట.



నవాబుల కోశాధికారులుగా ఉద్యోగాలు చేసే హిందువుల కోసం తయారు చేసే శాకాహార బిర్యానీని 'టెహ్రీ బిర్యాని' అని చెప్పేవారు.

****



ఔరంగజేబు దక్షిణాదిని ఆక్రమించుకున్నప్పుడు నిజామ్-ఉల్-ముల్క్‌ను హైదరాబారు గవర్నరుగా నియమించాడు. ఆ విధంగా బిర్యాని దక్షిణాదికి వచ్చింది. నిజాం వంటశాలలోనే రుచికరమైన హైదరాబాదీ బిర్యాని పుట్టింది!

****



అసంఖ్యాకుల అభిమాన వంటకం హైదరాబాదీ బిర్యాని! హైదరాబాదులోని వంటవాళ్ళు సంప్రదాయంగా తయారు చేసే బిర్యానికి ప్రత్యేకమైన తమ చేతి నైపుణ్యంతో మరింత రుచిని సమకూర్చేవారు. కొనసాగే నాణ్యతను పరీక్షించడానికి దాన్ని నేలమీద చల్లి మరీ చూసేవారు!

****



1856లో బ్రిటిష్ వాళ్ళు నవాబ్ వజీద్ అలీషాను కొల్‌కతాకు పంపినప్పుడు, ఆయన వెంట వంటవాళ్ళ బృందం వెళ్ళింది. ఆవిధంగా బిర్యాని కూడా అక్కడికి చేరింది. త్వరలోనే సరికొత్త వంటకం 'కొల్‌కతా బిర్యాని' సుప్రసిద్ధమైపోయింది.

****






కాలికట్ బిర్యాని అరేబియా సముద్రం మీదుగా అరేబియావర్తకుల ద్వారా కేరళ తీరం చేరింది. 'హాండీ' అనే మట్టిపాత్రలో కొబ్బరిచిప్పల మంటలమీదుగా ఈ బిర్యాని వండుతారు.



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.



| English | House | Name | Nation | Languages | Rain |
|---|---|---|---|---|---|
| Telugu | ఇల్లు | పేరు | దేశం | భాషలు | వాన |
| Hindi | घर<br>ఘర్ | नाम<br>నామ్ | देश<br>దేశ్ | भाषाएँ<br>భాషాయేం | बारिश<br>బారిష్ |
| Tamil | வீடு<br>వీడు | பெயர்<br>పెయర్ | நாடு<br>నాడు | மொழிகள்<br>మొళిగళ్ | மழை<br>మళై |
| Bengali | বাড়ী<br>బారి | নাম<br>నామ్ | দেশ<br>దేశ్ | ভাষা<br>భాషా | বৃষ্টি<br>బ్రిష్టి |
| Marathi | घर<br>ఘర్ | नांव<br>నావ్ | देश<br>దేశ్ | भाषा<br>భాషా | पाऊस<br>పావూస్ |
| Kannada | ಮನೆ<br>మనె | ಹೆಸರು<br>హెసరు | ದೇಶ<br>దేశ | ಭಾಷೆಗಳು<br>భాషెగళు | ಮಳೆ<br>మళె |
| Oriya | ଘର<br>ఘర | ନାମ<br>నామ | ଦେଶ<br>దేశ | ଭାଷା<br>వాషా | ବର୍ଷା<br>బర్షా |
| Gujarati | ઘર<br>ఘర్ | નામ<br>నామ్ | દેશ<br>దేశ్ | ભાષાઓ<br>భాషావో | વરસાદ<br>వర్సాద్ |
| Assamese | ঘৰ<br>ఘర్ | নাম<br>నామ్ | ৰাষ্ট্ৰ<br>రాష్ట్ర | ভাষা<br>భాఖా | বৰষুণ<br>బరోఖున్ |
| Malayalam | വീട്<br>వీడు | പേര്<br>పేరు | രാജ്യം<br>రాజ్యం | ഭാഷ<br>భాషా | മഴ<br>మళ |
| Santali | [illegible]<br>ఓడాహ్ | [illegible]<br>నుతుమ్ | [illegible]<br>దిషోమ్ | [illegible]<br>ఆడామ్ | [illegible]<br>జాడీ |
| Sanskrit | गृहम्<br>గృహం | नाम<br>నామ | राष्ट्रम्<br>రాష్ట్రమ్ | भाषाः<br>భాషాః | वृष्टिः<br>వృష్టిః |



కింద ఇచ్చిన ఐటలిక్స్‌లోని పదాలను గమనించండి. పై జాబితా సహాయంతో వాటి అర్థాలకు అనుగుణంగా ఖాళీలను నింపండి!

1. నా హెసరు ............................
2. మా ఓడాహ్‌లో ........ గదులున్నాయి.



| English | Festival | Moon | Child | Flower | River |
|---|---|---|---|---|---|
| Telugu | పండుగ | చందమామ | బిడ్డ | పువ్వు | నది |
| Hindi | त्योहार<br>త్యోహార్ | चाँद<br>చాంద్ | बच्चा<br>బచ్చా | फूल<br>ఫూల్ | नदी<br>నదీ |
| Tamil | திருநாள்<br>తిరునాళ్ | நிலா<br>నిలా | குழந்தை<br>కుళంధై | பூ<br>పూ | ஆறு<br>ఆరు |
| Bengali | উৎসব<br>ఉత్సబ్ | চাঁদ<br>చాంద్ | শিশু<br>శిశు | ফুল<br>ఫుల్ | নদী<br>నదీ |
| Marathi | सण<br>సణ్ | चांदोबा<br>చాందోబా | बाळ<br>బాళ్ | फूल<br>ఫూల్ | नदी<br>నదీ |
| Kannada | ಹಬ್ಬ<br>హబ్బ | ಚಂದ್ರ<br>చంద్ర | ಮಗು<br>మగు | ಹೂವು<br>హూవు | ನದಿ<br>నది |
| Oriya | ଉତ୍ସବ<br>ఉత్సబ | ଜହ୍ନ<br>జహ్న | ଶିଶୁ<br>శిశు | ଫୁଲ<br>ఫుల | ନଦୀ<br>నదీ |
| Gujarati | તહેવાર<br>తహేవార్ | ચન્દ્રમા<br>చంద్రమా | બાળક<br>బాలక్ | ફૂલ<br>ఫూల్ | નદી<br>నదీ |
| Assamese | উৎসৱ<br>ఉత్సవ్ | চন্দ্ৰ<br>చంద్ర | শিশু<br>హిఖు | ফুল<br>ఫుల్ | নদী<br>నొదీ |
| Malayalam | ഉത്സവം<br>ఉత్సవం | ചന്ദ്രൻ<br>చంద్రన్ | കുട്ടി<br>కుట్టి | പൂവ്<br>పూవ్ | നദി<br>నది |
| Santali | ᱯᱟᱨᱟᱵ<br>పారాబ్ | ᱧᱤᱫᱟ ᱪᱟᱸᱫᱚ<br>నీందా చాందో | ᱜᱤᱫᱽᱨᱟ<br>గీధ్రా | ᱵᱟᱦᱟ<br>బాహా | ᱜᱟᱰᱟ<br>గాడా |
| Sanskrit | उत्सवः<br>ఉత్సవః | चन्द्रः<br>చంద్రః | शिशुः<br>శిశుః | पुष्पम्<br>పుష్పం | नदी<br>నదీ |

3. ..................... మా రాష్ట్ర రిపబ్లిక్ దినోత్సవం.
4. ఈ మొళిగళిల్ అన్నిటిలో ................. నా మాతృభాష.
5. బారిష్ పడుతున్నప్పుడు నేను ........................ తినడానికి ఎక్కువగా ఇష్టపడతాను.
6. ..................... నా అభిమాన ఉత్సవః.
7. ..................... చందమామపై అడుగుపెట్టిన తొలి మానవుడు.
8. ........... సంవత్సరాలకు తక్కువగా ఉన్న వాళ్ళను బాల్ అంటాం.
9. కురింజి అనే పూవ్ ............ ఏళ్ళకోసారి పూస్తుంది.
10. భారతదేశం, పాకిస్థాన్‌ల గుండా ................. నదీ ప్రవహిస్తోంది.








## బండను పైకెత్తే విశ్వాసం!

హజ్రాత్ పీర్ కామరాలీ దర్గా అన్ని మతాల భక్తులకూ సందర్శనా స్థలంగా ఉంటోంది. పుణే, సతారా రోడ్డులో పుణేకు 12 కి.మీ. దూరంలో ఈ దర్గా ఉంటోంది. ఈ దర్గా ప్రాంగణంలో ఉన్న 'పైకి ఎగసే శిల'ను అందరూ చూడవచ్చు.

సుప్రసిద్ధమైన ఈ రాతి బరువు 90 కి.గ్రా. ఉంటుందంటారు. దీనిని తొమ్మిది మంది లేదా పదకొండు మంది ''హాజీ కామరాలీ దర్వేష్,'' అని ఫకీరు పేరు చెబుతూ చూపుడువేళ్ళతో ఈ బండను పైకెత్తుతారు! ఆ పేరు ఉచ్చరించడం ఆపగానే బండకింద పడిపోతుందని భక్తులు విశ్వసిస్తారు. అలా బండను పైకెత్తేవాళ్ళు తాము సన్యాసిచేత ప్రత్యేకంగా ఆశీర్వదించబడిన వాళ్ళమని భావించుకుంటూ శిలను పైకెత్తాలని అంటారు.

## వింత ఆచారాలు గల గుడి

కర్ణాటకలోని సౌందత్తి పట్టణం ఓ యాత్రాస్థలం. ఇక్కడి గుడిలోని దేవత పేరు ఎల్లమ్మ. రేణుకామాత అని కూడా పిలుస్తారు. సతీదేవి భౌతికకాయాన్ని విష్ణువు తన చక్రంతో ఖండ ఖండాలుగా చేసినప్పుడు అందులో ఒక ఖండం ఇక్కడ పడిందని ఓ పూర్వగాథ చెబుతుంది.

ఈ గుడిలో ఒక వింత ఆచారాన్ని అనుసరిస్తారు. ఈ ఆలయాన్ని, సందర్శించే భక్తులు ఇక్కడున్న 'యోగర్బావి సత్యమ్మ కుండ' అనే కోనేరు పవిత్ర జలాలలో నగ్నంగా స్నానమాచరించి మరీ వస్తారు! ఈ కోనేరు కొండకింద ఉంటోంది. ఉత్సవ కాలంలో ఈ కొలనులో ఇలా స్నానం చేసి నూతన వస్త్రాలు ధరించి ఆలయ దర్శనానికి వెళతారు.



# పాతాళదుర్గం - 15




[పొట్టిరాక్షసుడు చేసిన సహాయం వల్ల, ధూమకుడూ అతడి అనుచరులూ కందకంలోని రహస్య సొరంగమార్గం చేరారు. దారిలో వారికి కొందరు రాక్షసబ్బంట్లు ఎదురయ్యారు. వాళ్ళ నుంచి అతి జాగ్రత్తగా తప్పించుకుని ధూమకుడూ వాళ్ళు సొరంగద్వారాన్ని సమీపించగానే, ఏనుగులు పూన్చిన రథంలో పోతున్న ఒక గొప్ప రాక్షసుడు వాళ్ళ కంటబడ్డాడు. -తరవాత]

ఏనుగులు లాగుతున్న రథం తమ దృష్టి నుంచి పోగానే, ధూమకుడు తన ఇద్దరు అనుచరుల ముఖాల కేసీ చూశాడు. వాళ్ళు భయపడుతున్నారో, ఆశ్చర్యపడుతున్నారో తెలుసుకోవాలన్నదే అతడి ప్రయత్నం. ఎందుకంటే, తాము ఎలాగైతేనేం మహాకలి రాక్షసుడుండే దండకారణ్యం చేరారు. శత్రువుల వల్ల నిజమైన కష్టాలు ప్రారంభమయ్యేదిప్పుడే.

సోమకుడు విల్లంబులు గట్టిగా గుప్పెట బిగించి కన్నార్పకుండా, రాక్షసుడు పోయిన మార్గం కేసి చూస్తున్నాడు. విరూపుడు ఈటె మొనను వేళ్ళతో నిమురుతున్నాడు. వాళ్ళల్లో భయచిహ్నాలేమీ లేవు, ఇద్దరూ పళ్ళు గట్టిగా బిగించి వున్నారు.

''ఆ రథంలో పోయినవాడు మహాకలి-పాతాళదుర్గంరాజు అనేదాంట్లో సందేహం లేదు,'' అన్నాడు ధూమకుడు.

''నేనూ అలాగే అనుకుంటున్నాను. నువ్వు ఊ.. అన్నట్టయితే, ఒక్కబాణం దెబ్బతో వాణ్ణి రథం మీది నుంచి కింద పడగొట్టేవాణ్ణి,'' అన్నాడు సోమకుడు.

''అది ప్రమాదం. వాడు చచ్చినా, వాడి రథం వెనక నడిచే ఆయుధంగాళ్ళందరూ మన మీదికి వచ్చి పడేవాళ్ళు. ఆ దుర్మార్గుణ్ణి



హతం చెయ్యటానికి, ఇంతకన్న సులువైన మార్గం ఏదైనా ధూమకబాబు ఆలోచించాలి,'' అన్నాడు విరూపుడు.

విరూపుడి ముందు చూపూ, ఇంగితజ్ఞానం ధూమకుడికి చాలా సంతోషం కలిగించింది. పులిందుడు తమ వెంట లేకపోవటం అన్ని విధాలా మేలే అయింది, అనుకున్నాడు ధూమకుడు. అతడే తమ వెంటవుంటే, మహాకలిని చూస్తూనే, నా పడుచు పెళ్ళాం భామా సింగిని ఎక్కడ దాచావురా? అంటూ అతడి మీదికి బల్లెం తీసుకుని అమితావేశంతో కుప్పించి దూకేవాడే!

``ఈ సొరంగమార్గం నుంచి శత్రువుల కంటబడకుండా బయటపడగలిగితే, ఇక అరణ్యంలో మననెవరూ పట్టుకోలేరు. జాగ్రత్తగా వినండి; సొరంగద్వారానికి ఎవరో కాపలా ఉన్నారు. వాళ్ళు అటూ ఇటూ నడిచే ధ్వని మీకు వినబడటం లేదా?'' అని అడిగాడు ధూమకుడు.

విరూపుడూ, సోమకుడూ కొంచెం సేపు నిశ్శబ్దంగా వుండి విని, ``ఒకళ్ళ కన్న ఎక్కువ మందే కాపలావున్నట్టుంది. వాళ్ళు మాట్లాడుకోవటం కూడా అస్పష్టంగా వినబడుతున్నది,'' అన్నారు.

``ముందు కాపలావాళ్ళ సంగతేమిటో తేల్చుకోవటం మంచిది. మనం ఇక్కడ జాగు చేస్తే, మరికొందరు రాక్షసబ్బంట్లు సొరంగ మార్గంలో ప్రవేశించవచ్చు, లేక ఇంతకు ముందు పోయినవాళ్ళు తిరిగి రావచ్చు,'' అంటూ ధూమకుడు రాళ్ళ చాటుగా పాకుతూపోయి, సొరంగద్వారం దారిచుట్టూ కలయచూశాడు. ద్వారానికి ఒకపక్కగా ఉన్నొక పెద్ద చెట్టు కింద ఒక రాక్షసుడూ, నలుగురు మానవబంట్లూ వున్నారు. ఆ అయిదుగురూ ఏదో సంగతి తీవ్రంగా చర్చిస్తున్నారు. మధ్య మధ్య బంట్లల్లో ఒకడు వాళ్ళనుంచి దూరంగా పోయి, చేతిలో ఉన్న కత్తిని సాము గరిడీల్లో తిప్పినట్టు గిరగిరా తిప్పుతున్నాడు.

ధూమకుడు వాళ్ళను చూసి కొంచెం నిస్పృహ చెందాడు. శత్రువుల కనుగప్పి సొరంగం నుంచి బయటపడి అరణ్యంలోకి పారిపోవటం అసాధ్యంలా కనిపించిందతడికి. ఇప్పుడేమిటి చేయటం? ధూమకుడిలా మథనపడుతూ తిరిగి తన అనుచరులకేసి రాబోయేంతలో, దూరంగా ఎవరో శంఖాన్ని

బలంగా పూరించిన ధ్వని వినబడింది. ఆ ధ్వని వింటూనే సొరంగమార్గం కాపలావాళ్ళు నలుగురూ చెట్టుకింది నుంచి బయలుదేరారు. కత్తిసాము చేస్తున్నవాడు సాము ఆపి, సొరంగద్వారంకేసి రాసాగాడు.

ధూమకుడు గబగబా తన అనుచరుల దగ్గిరకు వచ్చి సంగతంతా నాలుగు ముక్కల్లో చెప్పి, ''ఆ దుర్మార్గులు మధ్యాన్నభోజనానికో, సాయంకాలప్పిండానికో పోతున్నట్టున్నది. ఆ శంఖధ్వని అందుకు పిలుపై వుంటుంది. వాళ్ళల్లో ఒకడిటొస్తున్నాడు,'' అన్నాడు.

ఇంతలో రాక్షసబ్బంటు సొరంగద్వారం దగ్గిరకొచ్చి అనుమానంగా లోపలికి తొంగి చూస్తూ, ''ఏదో గుసగుస వినపడుతున్నదే, ఎవరక్కడ? రాక్షసదొరలా? మానవ కీటకాలా?'' అంటూ ప్రశ్నించాడు.

ధూమకుడు తన మిత్రులను ఆ బంటు సొరంగంలోకి దిగగానే చుట్టుముట్టమని హెచ్చరించి రాతి చాటునే ఉండి చిన్నగా దగ్గాడు. ఆ ధ్వని వింటూనే బంటు, ''ఎయ్, నాతో పరాచకాలా?'' అంటూ కత్తి తిప్పుతూ ఒక్క గెంతున సొరంగంలోకి దూకాడు. మరుక్షణంలో అక్కడున్న ముగ్గురూ రాళ్ళచాటు నుంచి లేచి అతణ్ణి చుట్టుముట్టి, ''కత్తి కింద పడెయ్, నీకొచ్చిన ప్రాణభయం ఏమీ లేదు,'' అన్నారు.

''ఎవరూ? జాతి తక్కువ మనుషులు! మీకు నేను లొంగిపోవాలా? మీరసలిక్కడికెలా రాగలిగారు? ముందు ఆయుధాలు కిందపడేసి, సాగిలపడండి. నేనెవరో తెలుసా?



ఈ దండకారణ్యంలో నన్ను మించిన ఖడ్గవేత్త లేడు,'' అన్నాడు రాక్షసబంటు.

వాడు మాట ముగించీ ముగించకముందే, ధూమకుడు కత్తిపిడితో ఆ బంటు నెత్తిన గట్టిగా ఒకదెబ్బ కొట్టాడు. ఆ దెబ్బ తింటూనే వాడు చిన్నగా అరిచి కిందపడిపోయాడు. ధూమకుడు తలతిప్పి తన అనుచరులతో, ''వీణ్ణి మనవెంట అరణ్యంలోకి తీసుకుపోవటం మంచిది. వీడి ద్వారా మహాకలి రాక్షసుడి పాతాళదుర్గ రహస్యాలెన్నో తెలుసుకోవచ్చు,'' అన్నాడు.

సోమకుడూ, విరూపుడూ కలిసి రాక్షస బంటును లేవనెత్తి భుజాన వేసుకుని బయలుదేరారు. ధూమకుడు ముందుగా సొరంగ ద్వారం దాటి బయటికి వచ్చాడు. అక్కడ శత్రువు లెవరూ లేరు. కాని, గుబురుగా



పెరిగిన చెట్లున్న ప్రదేశం చేరాలంటే, నాలు గైదు వందల గజాలదూరం మైదాన ప్రదేశంలో నడవాలి.

"వేగంగా పరిగెత్తాలి. అరణ్యం చేరే వరకూ మనకు రక్షణ లేదు," అంటూ ధూమకుడు తన అనుచరుల్ని హెచ్చరించాడు. వాళ్ళు పరిగెత్తబోయేంతలో, అప్పటి వరకూ తిన్న దెబ్బతో మైకంలో పడివున్న రాక్షసబంటు, ఆ మైకం కాస్త వదిలి, "శత్రువులు! శత్రువులు! పట్టుకోండి," అంటూ కేకలు పెట్టసాగాడు.

"కాలయాపన ప్రమాదం. వాణ్ణి ఆ సారంగంలోనే పడవేసి, నా వెంట పరిగెత్తి రండి," అని ఆజ్ఞాపించాడు ధూమకుడు. ఆ వెంటనే విరూపుడూ, సోమకుడూ, "చావ్వేధవా!" అంటూ రాక్షసబ్బంటును సారంగంలోకి విసిరివేశారు.

వాళ్ళు ముగ్గురూ మైదానం దాటి గుబురుచెట్లున్న ప్రదేశం చేరుకున్నారు. వాళ్ళను రాక్షుడి కాపలా వాళ్ళెవరూ చూసినట్టులేదు. అరణ్యమంతా నిశ్శబ్దంగా ఉన్నది. సూర్యుడు పడమటి దిక్కుకు బాగా వాలిపోయాడు. తాము అరణ్యంలో రహస్యంగా జీవిస్తూ, మహాకలి రాక్షుడి పాతాళదుర్గాన్ని గురించిన రహస్యం తెలుసుకోవాలి. ఆ రాక్షుడి బంటు ఎవడైనా చెప్పందే, ఆ రహస్యం కనుక్కోవటం తమకు సాధ్యం కాదు, అనుకున్నాడు ధూమకుడు.

ధూమకుడు తానెటుపోతున్నదీ ఆలోచించకుండానే అరణ్యంలోకి చాలా దూరం నడిచి, తన వెనక వస్తున్న అనుచరులతో, "ఈ రాత్రికి మనం అరణ్యంలో దొరికేపళ్ళూఫలాలూ తిని ఆకలి చల్లార్చుకోవలిసిందే. మనం అదిగో ఆ కనబడే కొండల్లో, ఏదైనా మంచి గుహ ఒకటి చూసుకుని నివాసం ఏర్పరుచుకుందాం," అన్నాడు.

సోమకుడు అంగీకార సూచకంగా తల వూపాడు. విరూపుడు చుట్టూ ఓసారి కలయ చూసి, "ఇంత మహాభయంకరారణ్యం నేనెక్కడా చూడలేదు. మీకు లోగడే చెప్పాను గదా-ఈ అరణ్యంలో ఎక్కడో కాలశంబర మాంత్రికదొర ఉన్నాడు. ఆ దొరను కలుసుకుంటే.."

విరూపుడు మాట ముగించే లోపలే ధూమకుడి దగ్గిరవున్న మంత్రదండం కీచుమంటూ కదిలి, ఎదురుగావున్న కొండలకేసి అతణ్ణి గుంజసాగింది. ధూమకుడు ఎంతో ఉత్సా

హంగా, ‘‘ఇన్నాళ్ళుగా దీని మాటే మరిచాం, సుమా! మాంత్రికుడు, మహాకలి సేవకులకు దొరకలేదనీ, ఇక్కడే ఎక్కడో స్వేచ్ఛగా ఉన్నాడనీ, నాకు గట్టి నమ్మకం కలుగుతున్నది. బహుశా, ఆ కనబడే కొండప్రాంతాల ఉండి ఉంటాడు,’’ అంటూ వాటికేసి ఓ క్షణకాలం చూసి, ‘‘మనం చీకటిపడే లోపల అక్కడికి చేరటం మంచిది. మీరు చెట్లెక్కి చుట్టుపక్కల రాక్షసబ్బంట్లెవరైనా ఉన్నారేమో చూడండి,’’ అన్నాడు.

సోమకుడూ, విరూపుడూ అక్కడవున్న ఒకఎత్తయినచెట్టుమీదికి గబగబా పాకిపోయి, నాలుగైదు నిమిషాలపాటు ఆ చుట్టుపక్కల అంతా పరీక్షించి చూసి, హడావిడిగా చెట్టు దిగి వచ్చారు. ముందుగా విరూపుడు, ధూమకుణ్ణి సమీపించి, ‘‘ధూమక దొరా! నా కళ్ళనే నేను నమ్మలేకపోయానంటే, నమ్ము. రాక్షసులూ, వాళ్ళ బంట్లూ అరణ్యంలో అక్కడక్కడా చెట్లు నరికి వ్యవసాయం చేస్తున్నారు. భూమి దున్నటానికీ, బళ్ళు లాగటానికీ వాళ్ళు పయోగిస్తున్న జంతువులేమిటో తెలుసా? ఏనుగులూ, సింహాలూ, లొట్టిపిట్టలూ!’’ అన్నాడు.

‘‘మనుషుల్నీ, జంతువుల్నీ పీక్కుతినే రాక్షసులు భూమి దున్ని సేద్యం చేస్తున్నారా? ఆశ్చర్యంగా ఉంది. సరే, మనం శత్రువుల కంటబడకుండా కొండప్రాతం చేరవచ్చా?’’ అన్నాడు ధూమకుడు.

‘‘ఆ దుర్మార్గులు ఎవరి పనుల్లో వాళ్ళున్నారు. వ్యవసాయప్పనిముట్లు తప్ప, ఎవరి



చేతిలోనూ ఆయుధాలు లేవు. పనిలోపనిగా కొందరి గొంతుల్లో బాణాలు గుచ్చమంటావా?’’ అన్నాడు సోమకుడు.

‘‘తొందరపడి అలాంటి పొరబాటు చేయకు. మనం ఇక్కడ ఉన్నట్టు ముందుగానే శత్రువుకు మనమే స్వయంగా హెచ్చరిక ఇచ్చిన వాళ్ళమవుతాం. ఇక జాగ్రత్తగా నడవండి, మంత్రదండం గింజుకుంటూ చూపే, ఆ కొండకేసి,’’ అంటూ ధూమకుడు బయలుదేరాడు.

అంతలో సొరంగద్వారం వైపున పెద్ద కోలాహలం బయలుదేరింది. ఆ వెంటనే ముగ్గురూ చెట్టెక్కి, అక్కణ్ణించి సొరంగంకేసి చూశారు. దానిముందు కొందరు రాక్షసులూ, వాళ్ళ బంట్లూ గుంపుగా చేరి ఉన్నారు. వాళ్ళ మధ్య ‘ఖడ్గవేత్త’నని బీరాలు పలికిన బంటును

ఇద్దరు ముగ్గురు పట్టుకుని నిలబెట్టారు. వాడు ఆయాసపడుతూ చుట్టూ చేరిన వాళ్ళకు చేతులూపుతూ ఏమేమో చెపుతున్నాడు.

''సోమూ, విరూపా, వాడు మనను గురించే వాళ్ళకు ఏదో చెపుతున్నాడు. రాక్షసులు క్షణాలమీద అరణ్యంలో మన వేట ప్రారంభిస్తారు. పదండి, ఆ కొండకేసి పరిగెత్తండి,'' అంటూ ధూమకుడు చెట్టుమీంచి దూకి పరుగు ప్రారంభించాడు.

దాదాపు అరగంటకాలం వెనక్కు తిరిగి చూడకుండా ఆ ముగ్గురూ అరణ్యంలో చెట్టు చేమలనూ, రాయిరప్పలనూ దాటుకుంటూ పరిగెత్తి, చివరకు కొండపాదం చేరారు.

ఆ కొండ మీదా, దిగువనా కూడా పెద్ద పెద్ద వృక్షాలూ, పొదలూ కిక్కిరిసి ఉన్నవి. ఎదురుగా వారికి ఒక చిన్న జలపాతం కనిపించింది. దాన్ని చూస్తూనే సోమకుడు అమితోత్సాహంతో, ''అబ్బా, చాలా దాహంగా ఉంది! శత్రువుల మాట దేవుడెరుగు,'' అంటూ నీటిలోకి దిగి దాహం తీర్చుకోసాగాడు. చప్పున జలపాతం కట్టుబడిపోయింది. అప్పటి వరకూ నీరు ప్రవహించిన చోట నిలువెత్తున విశాలమైన ద్వారం ఉన్న సూచనగా గుర్తులు కనిపించినై. అబ్బురపడుతూ దానికేసే కళ్ళార్పకుండా చూస్తున్న ఆ ముగ్గురికీ ఆ ప్రదేశాన కాలశంబర మాంత్రికుడి రూపం ఛాయలా కనిపించింది. మంత్రించి నట్టు వాళ్ళు ముగ్గురూ నిశ్శబ్దంగా దాన్ని సమీపించేంతలో ద్వారం తెరుచుకున్నది. అదొక గుహ. లోపల అగ్నిజ్వాలలు భగ్గుభగ్గుమంటూ ప్రజ్వరిల్లుతున్నవి. *-(ఇంకాఉంది)*



## మయూరి

[ ''యుద్ధమా?'' అని అడిగాను నేను.
''మన పొరుగును తినేయడం సహజంగా భావించబడే చోటుకు మనం వెళుతున్నాం నాయనా. అరణ్యానికి స్వాగతం!'' అన్నాడు ఓమెన్.]

మేము భూగర్భం కేసి అడుగులు వేశాం. గువ్వా దారి చూపుతూంటే, నేను మాట్లాడక పోయినా పట్టుబట్టినట్టు చీనా ఏనుగు తెగ మాట్లాడే స్తోంది. తాతయ్యను భయంకరులైన జలమాన వుల మధ్య వదిలి రావడం నాకింకా బాధగానే ఉంది. మాటిమాటికీ వెనక్కు తిరిగి బెదురు చూపులు చూస్తూ నడుస్తున్నాను. అయినా, మరికొంత సేపటికి మేమొక చిన్న గుట్టను చేరుకున్నాం. కొలనులో తామరపువ్వులా అది నీళ్ళలో అలా తేలుతూ కనిపించింది. నేను గట్టిగా ఊపిరి పీల్చుకున్నాను. ఇదన్నమాట! ఎవరూ ఒక్క మాటకూడా చెప్పకుండానే మేము అనునిర్వను చేరుకున్నామని గ్రహించాను. సముద్రం చల్లగా ఉన్నప్పటికీ నా ముఖమెం దుకో వేడెక్కసాగింది. చెట్ల వేళ్ళూ, వాటి మధ్యన చిన్నా పెద్ద కన్నాల్లాంటి మార్గాలూ మాత్రమే మాకు కనిపి స్తున్నాయి. వాటిలో ఒక దానిలోకి నేను సులభంగా జొరబడి వెళ్ళవచ్చు. అదే మా పథకం కూడా. అనునిర్వ లోకి రహస్యంగా జొరబడాలి. అయితే నేను ప్రాకుతూ వెళ్ళవలసిన ఆ చీకటి మార్గంలో ఎలాంటి ఉపద్రవం పొంచి ఉందో ఎవరికి తెలుసు? అంతరించి పోయిన భూగర్భ ప్రాణుల పేర్లను గుర్తుచేసు కోవడానికిఎంతో ప్రయత్నించాను. కాని, ఒక్కటీ జ్ఞాపకం రాలేదు. సైన్స్ తరగతిలో పాఠాలను మరింత శ్రద్ధగా విని ఉండవలసింది, అనుకు న్నాను పశ్చాత్తాపంతో.

గుహ ముఖద్వారానికి అడ్డుగా ఉన్న సము ద్రపునాచును లెమన్ పక్కలకు తొలగించి, మాకేసి చూసింది. ఆ తరవాత డైనోజార్లతో, ''రాబిన్‌ను వదిలి పెట్టండి,'' అన్నది. దాని నోటి నుంచి చిన్న అల వెలువడింది. నేను కళ్ళు మూసుకున్నాను. నా కడుపు లోపల భయం ఇనుపగుండులా పెరిగి పెరిగి పెద్దది కాసా గింది. అయితే రాబిన్ మాత్రం సంతోషంగా గెంతుతున్నది. డైనోజార్ దాన్ని సుతారంగా గుహ





''గోస్ట్ ఫ్రాగా?! అంటే చనిపోయిన ప్రాణులే కాకుండా ఇక్కడ దయ్యాలు కూడా ఉంటాయా?'' అని అడిగాను నేను.

''మనం చనిపోలేదు, నాయనా,'' అన్నాడు ఓమెన్. ''ఆ మాట అనునిర్వలో అన్నావా నీ పని అయిపోయినట్టే; కాల గర్భంలో కలిసిపోగలవు,'' అని హెచ్చరించింది లెమన్.

''ఏమిటి నువ్వనేది!'' అని అడిగాన్నేను.

''మేము చనిపోయిన వారని చెబితే మాకు బాధకలుగుతుంది. ఆ మాటలు మమ్మల్ని గాయపరుస్తాయి,'' అని వివరించింది గువ్వా. కళ్ళ నుంచి ధారాపాతంగా కన్నీళ్ళు కారుస్తున్న చీనా ఏనుగును ఆమె చూపింది.

నేను గాఢంగా నిట్టూర్చాను. ఇది ఏమాత్రం శుభారంభం కాదు. నాకు చీనా ఏనుగు పట్ల సానుభూతి కలిగింది. నేను చెవుడుగా ఉంటే మా మధ్య మైత్రి మరింత గాఢంగా ఉండేదేమో. నేను నా చేతులను దాని తొండంపై ఉంచి ఓదార్చాను. ఆ తరవాత, ''సరే, ఆ గోస్ట్ ఫ్రాగ్ కథేమిటి?'' అని అడిగాను.

''గోస్ట్ ఫ్రాగ్ దక్షిణాఫ్రికా నుంచి వచ్చింది,'' అన్నది ఒక డైనోజార్. నేను గువ్వాకేసి చూశాను. ఆమె కూడా దక్షిణాఫ్రికా నుంచే వచ్చింది. అలా అని అంతకు క్రితమే ఓమెన్ నాకు చెప్పాడు.

''అవును. మేము ఒకే దేశం నుంచే వచ్చాం. అయినా, అక్కడున్నప్పుడు మేమెప్పుడు గానీ ఒకరినొకరు కలుసుకోలేదు,'' అన్నది గువ్వా గంభీరంగా.

ముఖద్వారంలో వదిలింది. అది నాకేసి మీసాలు ఊపుతూ, ''అంత భయంగా చూడకు నాయనా! మీరు కలకాలం ఇక్కడే మాతో ఉండిపోకూడదన్న ఆశయంతోనే ఇన్ని బాధలు పడుతున్నాం. కనీసం కృతజ్ఞత కలిగి ఉండు,'' అన్నది.

నేను కృతజ్ఞతగా నవ్వుతూ, ఏదో చెప్పడానికి ప్రయత్నించాను. అంతలో గువ్వా అడ్డుపడి, ''ఇది ఉపన్యాసాలివ్వడానికి తగ్గ సమయం కాదు, రాబిన్. నువ్వు కార్యరంగంలోకి దిగాలి,'' అన్నది దృఢమైన కంఠస్వరంతో.

రాబిన్‌పైకి చూసింది కాని, వెంటనే వినయంగా ఆజ్ఞను పాటించింది. గువ్వా ఏదైనా సరిగ్గానే చెబుతుంది. అల్లరిగా తిరిగే రాబిన్ బొద్దింకకు కూడా ఆ విషయం తెలుసు. అందువల్ల వెంటనే వెళ్ళిపోయింది. దాన్ని చూసిన ఒక డైనోజార్, ''అది గోస్ట్ ఫ్రాగ్‌ను తప్పక ఒప్పించగలదు. మంచి మాటకారి కదా,'' అన్నది మెల్లగా.

''మరయితే ఆ వింత పేరేమిటి? తలుపు వెనక దాక్కుని భయపెడుతుందా, ఏం?'' అని అడిగాను నేను .

పేలవంగా నవ్వాడు ఓమెన్. ''గోస్ట్ ఫ్రాగులు మామూలుగా వేగంగా ప్రవహించే కొండ వాగుల్లో ఉంటాయి. అయితే, వాటిలో ఒకజాతి కప్పలు దక్షిణాఫ్రికాలోని టేబుల్ మౌంటన్ స్కెలిటన్ గార్జ్ సంప్రదాయ శ్మశానాల్లోనే నివసిస్తాయి,'' అని నెమ్మదిగా వివరించింది లెమన్.

''అంతే కాదు. వాటి పొట్టకింది పలుచటి చర్మం కడుపులోపల ఉన్నవన్నీ కనిపించేటంత పారదర్శకంగా ఉంటుంది,'' అన్నాడు ఓమెన్.

''అది రాత్రుల్లో సమీపంలో ఉంచుకోదగిన మిత్రుడంతటి జంతువు కాదు,'' అంటున్నప్పుడు డైనోజార్లు వణికాయి.

అవకాశం లభిస్తే నేను డైనోజార్ల దగ్గర కూడా ఉండను. అయినా ఆ మాట బయటకు చెప్పకుండా మౌనం వహించాను.

''ప్రస్తుతమేమో అవి అంతరించి పోయిన ప్రాణుల జాబితాలోనే ఉన్నాయి. అయితే, అంతకు క్రితం ఎప్పుడో ఇక్కడికి రావడం ఆరంభించాయి,'' అన్నది గువ్వా.

''అదేమిటి రావడం ఆరంభించడం?'' అని అడిగాను, ఆ మాట అర్థం అంతుబట్టక.

''అవి డోడోల్లా ఒకటీ, రెండూ అంటూ మెల్ల మెల్లగా భూమిని వదిలి పెడుతూ వస్తున్నాయి. ఇలాగే కొనసాగినట్టయితే వర్తమానంలో బహుకొద్ది మాత్రమే మిగల గలవు,'' వివరించింది గువ్వా.

''గోస్ట్ ఫ్రాగ్ భూగర్భంలో నివసిస్తుందా?'' అని అడిగాన్నేను.

''అవును. అది ఉభయచరం. ఇక్కడా ఉండదు. అక్కడా ఉండదు. కొంచెం నీలాగా,'' అంటూ లెమన్ గట్టిగా తలాడించింది.

''అయితే బతుకంతా భూమికి అడుగున నాలుగు మీటర్ల లోతున గడిపే పర్పుల్ ఫ్రాగ్‌తో దానికిమంచి స్నేహం ఉంది. అందువల్ల తరచూ చూడ్డానికి వస్తుంది,'' అన్నాయి డైనోజార్లు.

''పర్పుల్ ఫ్రాగ్ ఎందుకలా చేస్తుంది?'' అని అడిగాన్నేను.

"తనజాతి ప్రాణిని చూడ్డం కోసం?" అన్నాడు ఓమెన్.

కలిసి జీవించే సంఘజీవితానికి అది ప్రజ్వల తార్కాణం అని నేను భావించాను.

''ఇంతకుముందు మీరు ఒకరినొకరు ఆహారంగా మింగేస్తామన్నారు కదా.. అంటే






ప్రాణులు ఇక్కడ మరణిస్తాయి. అంతే కదా?'' అని అడిగాను. ''మరి అలాంటప్పుడు అవి అంతరించిపోతాయి కదా?''

''మేము ప్రాణాలతో బతకడానికి తినం నాయనా. ఆనందం కోసం తింటాం. అయితే ఓల్మ్స్ మాత్రం అలా కాదనుకో,'' అన్నది లెమన్.

''అదేమిటి?'' అని అడిగాను నేను విస్మయంతో.

''ఓల్మ్స్ ఒక రకం గుడ్డి సలమండార్. దానికి పిగ్మెంట్ అంటే వర్ణద్రవ్యం అంటూ లేదు. అందువల్ల అది మరీ పారదర్శకంగా కనిపిస్తుంది. అది ఎలాంటి ఆహారమూ తీసుకోకుండా పది సంవత్సరాలు బతగ్గలదు!'' అన్నది ఒక డైనోజార్.

''మేము అమరజీవులం. వర్తమానంలో ఉన్న ప్రాణులకు మాత్రమే మరణం ప్రాప్తిస్తుంది. వాళ్ళే జనన మరణాల చక్రంలో చిక్కుకుంటారు. ఆ సూత్రాలు, చట్టాలు మాకు వర్తించవు. మేము తినబడతాము. అంతేగాని చనిపోతామని దానికి అర్థం కాదు,'' అన్నది గువ్వా.

నేను దాన్ని మరో ప్రశ్న అడగబోయి, కన్నంలోకి కనుమరుగైపోయిన బొద్దింక తిరిగి రావడంతో దాని కాళ్ళు, మీసాలు కనిపించడంతో ఆగిపోయాను. దాని వెంట గోస్ట్ ఫ్రాగ్ కూడా వచ్చింది. నేను ఊహించిన దానికన్నా అది దృఢంగా ఉంది. గోస్ట్‌ఫ్రాగ్ నన్ను ఒకసారి తేరిపార చూసి వెనక్కు వెల్లకిలా గెంతబోయింది. అప్పుడు దాని పొట్టలో ఉన్నదంతా చూడగలిగాను! ఆ వింత ప్రాణిని చూసి విస్తుపోయిననేను, ''థ్యాంక్స్!'' అన్నాను. అది తన పొట్టను మెల్లగా తడువుకుంటూ, ''నీ రాక గురించి 'ఒకరు' చెప్పారు. నువ్వు నావెంట వచ్చావంటే, ఆమె మనతో మాట్లాడగలరు,'' అన్నది.

''భూగర్భ ప్రాణుల సంగతేమిటి? ఈ చొరబాటు వాటికి సంతోషమేనా?'' అని అడిగాన్నేను కాస్త జంకుతూనే. వాళ్ళేం సమాధానం చెప్పగలరో నాకు ముందే తెలుసు.

''అవి పరవశం చెందుతాయని నేననుకోను,'' అన్నది గోస్ట్‌ఫ్రాగ్. బొద్దింక మీసాలతో దాని పొట్టను గిలిగింత పెట్టింది. కప్ప వికవిక నవ్వింది. చూస్తూంటే అవి గొప్ప స్నేహితుల్లా కనిపించాయి. ఎందుకో నాకు తెలియదు. వాటి కళ్ళల్లో ఒకే విధమైన ఉత్సాహం కనిపించింది. అంతలో గువ్వా తన తీక్షణమైన చూపులతో చూడగానే మా అమ్మ నాకు గుర్తొచ్చింది. మా తల్లిదండ్రులు స్పేస్ క్రాఫ్ట్‌లో క్షేమంగా ఉండాలని కోరుకున్నాను.

''నేను మాట్లాడాను. దూరంగా ఉండగలమని మాటిచ్చారు,'' అన్నది గోస్ట్‌ఫ్రాగ్‌హాందాగా.

"ఇకకాలం వృథా చేయకూడదు. ముందుకు సాగుదాం!'' ఆజ్ఞాపించాడు ఓమెన్. అతడు దాపుల్లో ఉన్న పగడాలను తదేకంగా పరిశీలిస్తున్న చీనా ఏనుగును తట్టి పిలవడంతో అది ఉలిక్కిపడి వెనక్కు తిరిగి మమ్మల్నందరినీ చూసి మరింత విస్మయం చెందింది.

గుండెను చేత్తో పట్టుకుని వంగి గుహలోకి జొరబడ్డాను. మార్గం నేను అనుకున్నంత ఇబ్బందికరంగా లేకపోవడం చూసి ఆశ్చర్యపడ్డాను. దాన్ని గమనించిన గువ్వా, ''వాళ్ళ వాళ్ళ శరీర ఉష్ణోగ్రతలకు అనుగుణంగా గుహలోని ఉష్ణోగ్రత మారుతూ ఉంటుంది. అలా కాకుంటే డైనోజార్ల నుంచి ఓల్మ్స్ వరకు ఒకే చోట చూడగలిగే వాళ్ళం కాదు!'' అన్నది.

''నా జాతి ఇప్పుడు అంతరించిపోయిందంటే...! (ఇప్పటికీ దాన్ని అసలు నమ్మలేకపోతున్నాను) నేను వెంటనే చచ్చిపోనన్నమాట!'' అనుకుంటూ గువ్వా వివరించిన జనన మరణాలచక్రం గురించి ఆలోచించసాగాను.

''నీ జాతి ఇప్పుడు నరకస్థితిలో ఉంటోంది. స్పేస్‌క్రాఫ్ట్స్ పాడవుతాయని మాకు నమ్మకం ఉన్నప్పటికీ, మానవజాతి భూతలానికి క్షేమంగా తిరిగివచ్చే అవకాశం ఉంది. అందువల్ల ప్రస్తుత పరిస్థితుల ప్రకారం నువ్విక్కడే మరణిస్తావు,'' అన్నాడు ఓమెన్. విషయం ఏదైనప్పటికీ కుండ బద్దలు కొట్టినట్టుగా చెప్పడం ఆయనకు అలవాటు!

మేము ఆ మార్గం గుండా వెళుతూంటే గుహ గోడలకున్న దీపాలు నర్తిస్తున్నట్టు కనిపించాయి. ఉన్నట్టుండి అవన్నీ మిణుగురు పురుగులని తెలియడంతో ఉలిక్కిపడ్డాను. "అవి కూడా అంతరించి పోనున్నాయా?'' అని నాలోనేను గొణుక్కుంటూన్నట్టు అడిగాను. పిల్లాడుగా ఉన్నప్పుడు తరచూ మిణుగురు పురుగులను పట్టి జాడీలో వేసేవాణ్ణి. అలా చేసినందుకు ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్నాను. గువ్వా విషాదంగా నవ్వుతూ, ''అంతరించిపోని వాళ్ళు ఎవరు నాయనా? ప్రతి ప్రాణి సహజ ఆవాసాన్నీ మీ జాతి జనులు సర్వనాశనం చేశారు. పంటల పరిరక్షణకంటూ క్రిమిసంహారక మందులు చల్లి ఒక్క పురుగూ పుట్రా లేకుండా చేస్తున్నారు. రాత్రింబవళ్ళను మీ నియంత్రణలో ఉంచుకోవాలని యావత్ భూమండలాన్ని వెలుగుతో నింపేస్తున్నారు. చీకట్లో బతికే ప్రాణుల గురించి మీరెందుకు పట్టించుకుంటారు?'' అని అడిగింది.

గువ్వా విసిరిన విమర్శనాస్త్రాలకు నా చెవులు చిల్లులు పడ్డాయి. గువ్వా మామూలుగా సాధు



స్వభావి. ఆమె అంత కఠినంగా మాట్లాడుతోం దంటే ఎంతో బాధను అనుభవించి ఉండాలి. అనునిర్వలోని ప్రాణులకు మా పట్ల కనికరం లేదంటే ఆశ్చర్యం లేదు. మనసులోనే క్షమా పణలు చెప్పుకున్నాను.

ముందుకు వెళ్ళేకొద్దీ మార్గం విశాలమవు తోంది. అప్పటికే సంధ్యాసమయమయింది. మార్గం చివర అస్తమయ సూర్యకిరణాలు కనిపించాయి. డైనోజార్లు ముందు నడుస్తూ దారి చూపుతున్నాయి.

గుహ నుంచి వెలుపలికి రాగానే కనిపించిన దృశ్యం సంభ్రమాశ్చర్యాలు కలిగించాయి. అక్కడి భూమి మరో కాలఘట్టానికి చెందినది. పచ్చటి మైదానాల మధ్య నవనవలాడే కొండ కోనలు. "నేను వీటిని ఇంతకు ముందెప్పుడో చూశాను... అవును... ఎక్కడో చూశాను," అన్నాన్నేను.



"బహుశా, నీ చరిత్ర పాఠ్యపుస్తకాల్లో చూసి ఉంటావు!" అన్నాడు ఓమెన్. ఆకాశం లేత ఎరుపు రంగులో ఉంది. గాలి ప్రాణంతో ఉన్నట్టు నా జుట్టుగుండా దూసుకుపోతోంది. నేను గుండెల నిండుగా ఊపిరి పీల్చుకున్నాను. చాలా నిర్మలంగా ఉన్నట్టు అనుభూతి పొందాను. అంత నిర్మలంగా ఉందేమిటీ, నా ముక్కుపుటాలు అదిరాయి.

అక్కడి ప్రకృతి శోభకు మైమరచిపోయి ఎదుటే ఉన్న మయూరిని గమనించలేక పోయాను. ఆమె చిత్రంలా నిలబడి ఉంది. కదలామెదలక నిలబడిందిగాని ప్రాణం ఉంది. సజీవ చిత్రంలా ఉంది. ఆమె నాలుగు చేతులకు నేపథ్యంగా ఎర్రటి ఆకాశం. ఆమె ఒత్తయిన శిరోజాలు భుజాల మీదుగా కాట్లాడుతూన్న నల్లత్రాచుల్లా కదలాడుతున్నాయి. ఆమె పచ్చటి గడ్డిని దుస్తులుగా ధరించింది. అవి కళ్ళు చెదిరేలా పచ్చటి పచ్చగా ఉన్నాయి. మానవజాతి నేరానికి పుట్టిన ఈ సుకుమారి తన రెండు కింది చేతులతో స్వాగతం పలుకుతూంటే నీలం, ఆకుపచ్చ-ఆకాశం, భూమి మౌన రోదనలతో నాకు శుభాకాంక్షలు పలుకుతున్నట్టనిపించింది. తక్కిన వారందరూ ఆమె ముందు వినయంగా మోకరిల్లారు. నేను కూడా వంగబోయాను. కాని అంతలోనే ఆమె అడ్డుకున్నది. "మానవ జాతి ప్రార్థించే సమయం ఎప్పుడో దాటిపోయింది," అంటూ మందహాసం చేసింది. ఆకాశంలో మెరుపు మెరిసింది. వేటాడబడే లేడిపిల్లలా నా గుండెల్లో భయం పరుగులు తీయసాగింది. -(ఇంకావుంది)

-సౌమ్యా రాజేంద్రన్

## ముక్కుతో చిత్రాలు




ఆంధ్ర రాష్ట్రానికి చెందిన సచివాలు రాంబాబు తన ముక్కుతో చిత్రాలు గీస్తాడు.

అతడు తన ముక్కును రంగుల్లో ముంచి కార్డ్ బోర్డ్ మీద చిత్రాలు గీస్తాడు. ఇది చాలా కష్టమైన పని. ఎందుకంటే కార్డ్‌బోర్డ్ పైన ముక్కుతో గీసే గీతలు గీసేప్పుడు సరిగ్గా కనబడవు. అయినా రాంబాబు ముక్కుతో వందకు పైబడ్డ చిత్రాలు గీశాడు. వీటిలో సుప్రసిద్ధులైన ఎపిజె అబ్దుల్ కలాం, చంద్రబాబునాయుడు, మదర్‌థెరీసా, సాయిబాబా, రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద మొదలైన వారి వర్ణచిత్రాలతో పాటు జగత్ప్రసిద్ధమైన తాజ్‌మహల్ చిత్రం కూడా ఉన్నది.

## ప్రపంచంలోకెల్లా అత్యంత వయసైన కప్ప!

మావూద్ దీవిలోని వెల్లింగ్టన్ అనే కప్ప ప్రపంచంలోకెల్లా అత్యంత వయసయినది అని చెబుతున్నారు. దీని వయసు 37 సంవత్సరాలు. ఇది చాలా గొప్ప విషయమే. అక్కడే మరో రెండు వయసైన కప్పలు కూడా ఉన్నాయి. మగ కప్ప గొల్లుమ్ వయసు 35 సంవత్సరాలు; జీనా అనే ఆడ కప్ప వయసు 34 సంవత్సరాలు.




విక్టోరియా యూనివర్సిటీలో అసోసియేట్ ప్రొఫెసర్‌గా ఉంటూన్న బెన్‌బెల్ గత 25 సంవత్సరాలుగా మావూద్ దీవిలోని ఈ మూడు కప్పలను జాగ్రత్తగా పరిశీలిస్తూ వస్తున్నాడు. 5 సెం.మీ. పొడవే ఉన్న ఈ బుల్లి కప్పలు కొన్ని చ.మీ.లను మాత్రమే తమ నివాసస్థలంగా కలిగి ఉన్నాయి. వాటి దీర్ఘాయువుకు ఇది కూడా ఒక కారణం కావచ్చు. అవి ఒకచోట తీరిగ్గా కూర్చుని ఏవైనా కీటకాలు వస్తే చటుక్కున పట్టి తినేస్తాయి. అందువల్ల శక్తి వృథాకాదు. సాలెపురుగులు వాటి అభిమాన ఫలహారం!

# సత్యన్ జ్ఞానశేఖరన్



**గెలుపొందిన అవార్డులు:**

- కామన్వెల్త్ యూత్ గేమ్స్(2008)లో మెన్స్ సింగిల్స్ టైటిల్.
- కేడెట్ బాయ్స్ సింగిల్స్ టైటిల్(యు-15) ఐటిటిఎఫ్ వరల్డ్ జూనియర్ సర్క్యూట్ టేబుల్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ (2008)లో డబుల్స్ టైటిల్.
- ఎస్‌ఏఐఎల్ నేషనల్ ర్యాంకింగ్ టేబుల్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ (2008)లో మెన్స్ అండ్ జూనియర్ బాయ్స్ సింగిల్స్ టైటిల్స్.
- 70వ జూనియర్ అండ్ యూత్ నేషనల్ టేబుల్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ (2009)లో జూనియర్ బాయ్స్ ఛాంపియన్‌షిప్.

పెడల్‌ను బిగిసిపట్టి, బంతి మీద దృష్టి నిలిపి చురుకుతనం, ఏకాగ్రత, వేగంగా ఆలోచించే శక్తి కావలసిన వేగమైన ఆటకు ఆయత్తమవుతాడు సత్యన్ జ్ఞానశేఖరన్.

తొమ్మిదేళ్ళకు పైగా తమిళనాడు రాష్ట్రానికి ప్రాతినిధ్యం వహిస్తూ టేబుల్ టెన్నిస్‌లో వందలాది పతకాలు సాధించాడు సత్యన్. కామన్వెల్త్ యూత్‌గేమ్స్‌లో రెండు బంగారు పతకాలను గెలుపొందిన మధుర క్షణాలను అతడు మనసులో పదిలపరచుకున్నాడు. ఆ విజయం అతనిలో 2010 కామన్వెల్త్ గేమ్స్‌లోనూ, ఆ తరవాత జరిగే ఒలింపిక్స్‌లోనూ బెస్ట్‌షాట్ ఇవ్వాలనే దృఢసంకల్పాన్ని కలిగించింది.

చెన్నయ్ అరుంబాక్కంలోని కెపిసివిఎస్ స్కూల్‌ల్లో ప్రస్తుతం పన్నెండవ తరగతి చదువుతున్న సత్యన్, ''టేబుల్ టెన్నిస్ ఏకాగ్రతను పెంచుతుంది గనక, అది చాలా ఉపయోగంగా ఉంది,'' అంటాడు. సత్యన్ తన అకాడెమీలో వీలైనప్పుడల్లా చిన్నపిల్లలకు శిక్షణ ఇవ్వడానికి చాలా ఇష్టపడతాడు!

అర్జున్ అవార్డ్ గ్రహీత అయిన తన కోచ్ వి.చంద్రశేఖర్‌ను తన రోల్‌మోడల్‌గా భావిస్తాడు. క్రీడల పట్ల ఆసక్తి కనబరచేవారికి, ''ఏదైనా ఒక్క క్రీడ మీద దృష్టిని కేంద్రీకరించండి. హార్డ్‌వర్క్ చెయ్యండి. సత్ఫలితాలు, విజయాలు తప్పకుండా మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తాయి!'' అని సలహా ఇస్తాడు సత్యన్ జ్ఞానశేఖరన్.



ఈ నెల ఉదయతారకు చందమామ తన శుభాకాంక్షలు తెలియజేస్తోంది.

# నవ్వుల పువ్వులు



మొదటి విద్యార్థి: ఎక్కడికి వెళదాం? బీచ్‌కా? సినిమాకా?

రెండవ విద్యార్థి: గ్రూప్ స్టడీకి వెళదాం. చదువు ముఖ్యం కదా?

మొదటి విద్యార్థి: అలాగా! సరే, ఇలా చేద్దాం మరి. నాణెం టాస్ వేసి చూద్దాం. బొమ్మ పడితే బీచ్; బొరుసైతే సినిమా. నాణెం అలాగే నిలబడితే గ్రూప్‌స్టడీకి వెళదాం!



రోగి: నాకు సుస్తీ చేసినప్పుడల్లా మీ దగ్గరికే వస్తాను డాక్టర్.

డాక్టర్: చాలా సంతోషం. నా మీద అంత నమ్మకం అన్నమాట!

రోగి: మీకున్న ఒకే ఒక రోగిని చంపరన్న గట్టి నమ్మకం!



టీచర్: నేను నీకు రెండు కుక్కలు, మరి రెండు కుక్కలు మళ్ళీ రెండు కుక్కలు ఇచ్చాననుకో. నీ దగ్గర మొత్తం ఎన్ని కుక్కలు ఉంటాయి?

సంతోష్: ఏడు.

టీచర్: కాదు. ఇప్పుడు చెప్పు. నీకు నేను మొదట రెండు నారింజపళ్ళు, మరి రెండు నారింజపళ్ళు, మళ్ళీ రెండు నారింజపళ్ళు ఇచ్చాననుకో. మొత్తం నీ దగ్గర ఎన్ని నారింజపళ్ళుంటాయి?

సంతోష్: ఆరు!

టీచర్: గుడ్. ఇప్పుడు చెప్పు. నేను నీకు రెండు కుక్కలు, మరి రెండు కుక్కలు, ఇంకా రెండు కుక్కలు ఇచ్చాననుకో. మొత్తం నీ దగ్గర ఎన్ని కుక్కలు ఉంటాయి?

సంతోష్: ఏడు.

టీచర్: రెండేసి కుక్కలు మూడు ఒకటిగా కలిపితే ఏడెలా అవుతాయి బాబూ?

సంతోష్: ఇప్పటికే ఇంటిదగ్గర నాకు ఒక కుక్క ఉంది కదా టీచర్!

## దత్తు



# 'ఎనర్జీ పౌడర్' వ్యాపారం

''ఎవరెవరు వ్యాపారం చేయాలనుకుంటు న్నారు?'' అని అడిగింది ముబీన్. అదేదో ముఖ్యమైనదిగా అనిపించడంతో ప్రతిఒక్కరూ చేతులెత్తారు. ''అలా అయితే దాన్నిలా తీసుకు రండి,'' అంటూ ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీ కేసి చూపింది ముబీన్.

రోహిత్ బామ్మ నిమ్మకాయ ముక్కల్ని ఎండలో తెల్లబట్ట మీద ఆరబెట్టి, ఆ బట్ట ఎగిరిపోకుండా డిక్షనరీని బరువుగా ఉంచింది.(అంటే-డిక్షనరీ ఆ విధంగానూ ఉపయోగపడుతుందన్నమాట!) ముబీన్ డిక్షనరీ తెరిచి బిజినెస్(వ్యాపారం) అనే మాటకు-ఒక వ్యక్తి చేసే వృత్తి లేదా వర్తకం అని అర్థం చదివింది. అది అర్థమయిందో లేదోగాని,



రోహిత్, సుమీ, జీతూ తమ తలలను వేగంగా ఊపారు. ''మనమందరం చేయవలసిందల్లా దేన్నయినా అమ్మడం!'' అన్నది ముబీన్.

కొంతసేపు మౌనం తరవాత, ''ఎనర్జీ పౌడర్ అమ్మితే ఎలా ఉంటుంది?'' అని ప్రశ్నించిన ఆమె దాన్ని గురించి వివరిస్తూ కాలం వృథా చేయకూడదనుకున్నది. రోహిత్‌ను వంటగదిలో గ్లూకోజ్ బిస్కెట్లు ఉన్నవేమో చూడమన్నది. తక్కినవాళ్ళు కూడా వాటికోసం తమ ఇళ్ళకెళ్ళి ఐదు ప్యాకెట్లతో తిరిగి వచ్చారు. ''మనం ఇప్పుడు చేయవలసిందల్లా బిస్కెట్లను నలగ్గొట్టి పిండిగా తయారు చేయడమే. అదే మనం అమ్మవలసిన ఎనర్జీ పౌడర్!'' అన్నది ముబీన్.

అందరూ ఉత్సాహంగా కార్యరంగంలోకి ఉరికారు. ''దాన్ని మనం ఉపయోగించుకోవచ్చు,'' అంటూ దూరంగా ఉన్న రోలునూ, పొత్రాన్నీ చూపింది ముబీన్. రోహిత్ బామ్మ వాలుకుర్చీలో నడుంవాల్చి కునుకు తీస్తోంది. ఎంత అదృష్టం! బిస్కెట్లను ముక్కలుగా చేసి రోట్లో వేసి దంచి నిమిషాల్లో పొడిని సిద్ధం చేసేశారు.

''సాధించాం!'' అన్నాడు సుమీ న్యూస్‌పేపర్ మీద రాసిలా పోసిన పౌడర్‌ను చూస్తూ పరమా నందంతో. ఉత్సాహం కొద్దీ చిటికెడు పౌడర్ తీసు కుని వాసన చూసిన జీతూ కసుక్కున తుమ్మి, అదేపనిగా ముక్కును గట్టిగా రుద్దుకోసాగాడు. పౌడర్‌ను వాసన చూసిన తక్కిన వారికి కూడా అదే అనుభవం ఎదురయింది.

‘‘అవును. ఆ రోట్లో బామ్మ తరచూ మిరియాలు పొడిచేస్తూ ఉంటుంది!’’ అన్నాడు రోహిత్ హఠాత్తుగా ఏదో కొత్త విషయం కనిపెట్టిన వాడిలా. తక్కిన వాళ్ళు అతడికేసి కోపంగా చూశారు. రోహిత్ మాత్రం తరగని ఉత్సాహంతో, ‘‘మిరియాల వాసన ఎనర్జీ పౌడర్! వినడానికే గొప్పగా ఉంది కదా?’’ అన్నాడు. ముబీన్ పెదాలపై నవ్వు విరిసింది.

తరవాత చేయవలసింది ఆకర్షణీయమైన ప్యాకింగ్. జీతూ కొన్ని కవర్లు తీసుకువచ్చాడు. ‘‘మీ ఇంట్లో ఇన్ని కవర్లున్నాయా! కొన్ని మురికిగా ఉన్నప్పటికీ బాగానే ఉన్నాయి!’’ అన్నది సుమీ. ఆ మాటలకు జీతూ పొంగిపోయాడు. అతడి అదృష్టం కొద్దీ వాటిని వాళ్ళమ్మ ఆ రోజు ఉదయమే చెత్తబుట్ట దాఖలాచేసింది. అందరూ కలిసి కవర్లలో పౌడర్‌ను నింపారు. ఇంకా కొంచెం మిగిలి ఉంది. ముబీన్ ఆలోచిస్తూ పెదవులు బిగించింది. ‘‘రోహిత్, అందులో ఒక జాడీ తీసుకుందామా? అది మన మెగాప్యాక్ అవుతుంది!’’ అందామె. రోహిత్ జాడీని తెచ్చి ఇచ్చాడు. మరుక్షణమే మెగాప్యాక్ సిద్ధమయింది. లేబుల్స్ కూడా రూపొందించబడ్డాయి. రోహిత్ మంచి మూడ్‌లో ఉన్నాడు. డ్రాగన్ బొమ్మలు తయారు చేశాడు. ‘రెండు ప్యాకెట్లు కొన్నవారికి దీన్నొకటి ఉచితంగా ఇద్దాం!’’ అంది ముబీన్ ఉత్సాహంగా. ‘‘నేను ప్రతి ఇంటి ముందూ ఫ్లూట్ వాయిస్తాను!’’ అని మాటిచ్చాడు జీతూ.

నలుగురు కార్పొరేట్ మేధావులూ ఆనందోద్వేగంతో బయలుదేరి వెళ్ళి 8–బి ఇంటి బెల్లు నొక్కారు. ‘‘దీన్ని సురేష్ అంకుల్‌కి అమ్మడం సులభం!’’ అన్నాడు రోహిత్. సురేష్ అంకుల్



మరీ మొహమాటస్థుడు. అతడు వచ్చి తలుపు తెరిచి, ‘‘ఆ... మీరా.. ఏం కావాలి?’’ అని అడిగాడు. వాళ్ళు లోపలికి వెళ్ళారు. రోహిత్ రెండు ప్యాకెట్లు తీసి అతడి చేతుల్లో పెట్టాడు. అదిచ్చే ఇన్‌స్టంట్ ఎనర్జీ గురించి ముబీన్ వివరించింది. జీతూ ఫ్లూట్ వాయించాడు. సురేష్ అంకుల్‌కి దిక్కుతోచలేదు. ‘‘ఏమిటా శబ్దం సురేష్?’’ అంటూ వంటగది నుంచి అతడి తల్లి కేక వేసింది. సురేష్ అంకుల్ హడావుడిగా కొంత డబ్బు వాళ్ళకిచ్చి పంపేసి ప్యాకెట్లకేసి అనుమానంగా చూడసాగాడు.

ఆ తరవాత వాళ్ళు రేణూ ఆంటీ దగ్గరికి వెళ్ళారు. ‘‘ఏమిటా ప్యాకెట్లు సరాసరి చెత్తబుట్టలో నుంచి తెచ్చినట్టున్నాయి,’’ అన్నదామె. బెదిరిపోయిన జీతూ, ‘‘ఆ సంగతి నీకెలా తెలుసు?’’ అని అనబోయి, మిత్రులు అడ్డుపడడంతో తమాయించుకున్నాడు. ఆ తరవాత జీతూ ఫ్లూటును గట్టిగా ఊదడంతో ఉయ్యాలలోని రేణూ ఆంటీ

చంటిబిడ్డ ఉలిక్కి పడి లేచి కెవ్వుమని ఏడ్పు లంకించుకోవడంతో, ''ఒక ప్యాకెట్ తీసుకుంటున్నాను,'' అంటూ రేణూ ఆంటీ దాన్ని తీసుకుని వాళ్ళకు డబ్బిచ్చింది. ''ఆంటీ, అద్భుతమైన రుచి! అద్భుతమైన శక్తి! ఉపయోగించి చూడండి!'' అని వల్లించింది ముబీన్ పట్టుబట్టి కంఠతా పట్టిన మాటలను. ''తప్పకుండా! ష్యూర్!'' అన్నది ఆంటీ వ్యంగ్యంగా.

పక్కింట్లోనూ వాళ్ళ అదృష్టం బావుంది. సోనూ అనే అయిదేళ్ళ కుర్రాడికి 'ఎనర్జీ పౌడర్' అనే మాట బాగా నచ్చి, ''నాకో ప్యాకెట్ కావాలి,'' అన్నాడు. ''వద్దు, వద్దు!'' అంటూ అడ్డుపడింది వాడి తల్లి. ''రెండు కొంటే డ్రాగన్ స్టికర్స్ ఫ్రీ,'' అన్నాడు రోహిత్. ''నాకు రెండు ప్యాకెట్లు కావాలి!'' అని ఏడుస్తూ సోనూ కిందపడి పొర్లసాగాడు. నలుగురు పిల్లలూ అతడికేసి అమితాశ్చర్యంతో చూడసాగారు. సోనూ ఏడుపుకు అనుగుణంగా జీతూ ఫ్లూట్ వాయించడం మొదలెట్టాడు. మరో



మార్గం కనిపించక సోనూ తల్లి రెండు ప్యాకెట్లు కొన్నది! ఆ తరవాత సీమా ఆంటీ ఏమాత్రం వెనుకాడకుండా మెగా ప్యాక్‌ను కొనడం పిల్లలకెంతో ఆనందం కలిగించింది. ఆమె ఇంట్లోకి వెళ్ళి కూతురితో, ''నీకు తెలియదా? ఇది చాలా చౌకబేరం. జాడీ ఎనిమిది రూపాయలకే!'' అనడం పిల్లలకు వినిపించలేదు.

మధ్యాహ్నం కల్లా వాళ్ళు బాగానే వ్యాపారం చేశారు. సాయంకాలం ప్యాకెట్లు అమ్మకానికి జీతూ మాత్రమే వెళ్ళాడు. తక్కిన వాళ్ళు ట్యూషన్ తరగతులకు వెళ్ళవలసి వచ్చింది. రేణూ ఆంటీ ఇంటిపక్కగా వెళుతూ, ''ఎనర్జీ పౌడర్! ఆంటీ!'' అని కేకపెట్టాడు. ఆ తరవాత ఫ్లూట్ తీసి ఊదడం ప్రారంభించాడు జీతూ. ''ఆ ఫ్లూట్ కావాలనుకుంటున్నాను. చాలా బావుంది ఇస్తావా?'' అని అడిగింది రేణూ ఆంటీ. జీతూ సంతోషంగా దాన్ని ఇచ్చేశాడు. ఆ తరవాత ఎందుకో మరి, ఒక్కరూ ఎనర్జీ పౌడర్ కొనడానికి ఆసక్తి చూపలేదు. సురేష్ అంకుల్ కూడా కొనలేదు!

ఆ తరవాత జీతూ మిత్రులను కలుసుకుని, ''నేను ఎనర్జీ పౌడర్‌ను అమ్మలేకపోయాను. అయితే, చూడండి. నా ఫ్లూట్‌కు పది రూపాయలు వచ్చాయి!'' అన్నాడు. ఆ తరవాత వాళ్ళు పౌడర్ అమ్మడానికి ఎంతో ప్రయత్నించారుగాని, ఒక్క ప్యాకెట్ కూడా అమ్మలేకపోయారు. వాళ్ళు మెట్లమీద చతికిలబడ్డారు. అప్పుడు ముబీన్, ''జీతూ, నువ్వు మరీ పసివాడివి. నీకు వ్యాపారంలోని మెళకువలు అర్థంకావు. నువ్వా ఫ్లూట్‌ను అమ్మి ఉండకూడదు. ఆ ఫ్లూట్ నుంచి వెలువడే సంగీతాన్నే జనం ఇష్టపడ్డారు. అదే మన పెద్ద ఆకర్షణ...?'' అన్నది. -రమారమేష్


భయమెరుగని నలుగురు
పోగొట్టుకున్న బంగారు గొలుసు - 2
చిత్రాలు: గాంధీ అయ్య
వాళ్ళు నగల దుకాణంలోకి వెళ్ళారు.
పిల్లలూ, మీకేం కావాలి?
వాళ్ళు అక్కడికి వచ్చిన పనిని గురించి దీపక్ క్లుప్తంగా వివరించాడు.
అయ్యా, ఎవరైనా మీకు బంగారు గొలుసును అమ్మారా?
అపరాధ పరిశోధన ఆట ఆడుకుంటున్నారా? అలాంటి పెద్ద విషయాలు ఆరాతీయడానికి మీరు మరీ పసివాళ్ళు!
పోలీసులకు చెప్పండి. వాళ్ళు తగిన చర్య తీసుకుంటారు.
మేము, సాయపడడానికే ప్రయత్నిస్తున్నాం.
ఈ పిల్లలు నిజంగానే పట్టుదలతో ఉన్నారు!
వినండి. మీకో విషయం చెబుతాను. ఆ విషయాన్ని మీకు సాయపడగల పెద్దలకు చెప్పండి.
మనం ఈ విషయాన్ని సుధీర్ అంకుల్‌కు చెబుదాం!


ఉదయం ఒక స్త్రీ గొలుసుతో మా దుకాణానికి వచ్చింది....
అవును. ఆమె ఒక్క గొలుసే తీసుకురావడం వల్ల నాకు అనుమానం కలిగింది.
నా వృత్తిలో నేను జాగ్రత్తగా ఉండాలి కదా. అందువల్ల రెండవ గొలుసును కూడా తీసుకురమ్మన్నాను.
ఆ గొలుసును కూడా ఆవిడ తెచ్చిందా?
అది బంగారం గొలుసేనా?
లేదు. నేనామాట చెప్పగానే పట్టరాని కోపంతో అరవసాగింది. ఏడ్చేసింది.
అనిత గొలుసు ఎలా ఉంటుందో వివరించి, ఆ స్త్రీ తెచ్చిన గొలుసు అలాగే ఉంటుందా అని అడిగింది.
నేనా గొలుసును కొనదలుచుకోలేదు.... అందువల్ల నేను దాన్ని సరిగ్గా చూడలేదు.
ఆ స్త్రీ ఎలా ఉంటుందో వివరించమని పిల్లలు అతణ్ణి అడిగారు.
మనం ఈ సంగతి ఉమకు చెప్పాలి.



దొంగను పట్టుకోవడానికి మీరు సాయపడతారా?
చూడండి. ఆమె నిర్దోషి అనే నేను అనుకుంటున్నాను.
నలుగురు పిల్లలూ అక్కడి నుంచి సైకిళ్ళపై బయలుదేరారు.
ఆ దుకాణాదారు సాయపడ గలడని నేను అనుకోవడం లేదు.
నేనో పథకం ఆలోచించాను... అది తప్పక పనిచేస్తుందనుకుంటాను.
ఏమిటి నీ పథకం?
మంగమ్మ దొంగ అయినట్టయితే, రెండో గొలుసు కాజేయడానికి ప్రయత్నిస్తుంది.
అంటే రెండో గొలుసును కూడా ఆమె తీసుకునేట్టు చేయాలంటావా?
అవును. ఆ వెంటనే ఆమె దాన్ని నగల దుకాణానికి తీసుకు వెళుతుంది. మనం ముందే దుకాణాదారును హెచ్చరించి నట్టయితే ఆమెను అక్కడికక్కడే పట్టుకోవచ్చు.
మనం రెండు గొలుసులనూ పట్టుకోలేకపోతే నష్టం కదా?
దీన్ని మనం పకడ్బందీగా ప్లాన్ చెయ్యాలి దీపా. మరీ జాగ్రత్త వహించాలి.


వాళ్ళు మళ్ళీ ఉమ ఇంటికి వెళ్ళి ఉమకూ, ఆమె తల్లికీ తమ పథకాన్ని వివరించారు.
మంగమ్మ చాలా నమ్మకస్థురాలని మీకు నేను ముందే చెప్పాను కదా?
మంచిదే! మంగమ్మదాన్ని తీసుకోలేదంటే అది భద్రంగానే ఉంటుంది.
ఆఖరికి వాళ్ళ పథకానికి ఉమ తల్లి అంగీకరించింది. ఉమ బడికి వెళ్ళే ముందు గొలుసును టేబుల్ మీద ఉంచి వెళ్ళింది.
సాయంకాలం ఉమ తన గదిలోకి వెళ్ళి చూసినప్పుడు...
ఓ.... లేదు... నా గొలుసు ఎక్కడ?
ఉమ తల్లి కూడా దిగ్భ్రాంతి చెందింది.
మంగమ్మ దాన్ని తీసుకోదని నేనెంతో నమ్మాను.
ఊరెళ్ళిన ఉమ తండ్రి అప్పుడే తిరిగి వచ్చాడు.
నేను తిరిగి వచ్చేశాను.
ఏమిటి సంగతి? ఇద్దరూ విచారంగా ఉన్నారెందుకు?
(ఇంకా ఉంది)


Log onto www.chandamama.com
Your Chandamama is available in many
avatars!
Regional Chandamama (9+ age group): Read your favourite stories in your own language! Chandamama takes you closer home even as your imagination soars!
Rs.20/-
Your Language, Your Chandamama.
* Ramayana * Vikram-Vetal * Jataka * Arya
Available in 12 Languages:
Telugu, Hindi, Marathi, Oriya, Kannada, Bengali, Tamil, Malayalam, Gujarati, Assamese, Sanskrit, Santali
Rs.15/-
Junior
Junior
Junior
Junior Chandamama (4+ age group): A magazine for the little ones peppered with activities, pictures, and stories that will grip their imagination.
Make friends with Mintoo, Gooba, and a host of other whacky characters!
* Picture story
* Puzzles & Crosswords
* Colouring
* Rebus
You name it and it's got it!
Chandamama
Chandamama English (9+ age group): A children's magazine that has adapted itself to the changing needs of children across decades, Chandamama English offers you a delectable mix of the classic and the contemporary in 72 pages that value fun!
Rs.25/-
* Sports
* Technology
* Contemporary stories
* Classics
Revamped. Redesigned. Relevant. Read it!
SMS CSHOP to 54646 & we'll get in touch with you! Subscribe Now!

